వేంకటశేషకవి, అనుముల, 1905-

అభినవతారా శశాంక విజయము, అను, సతీతార

నంద్యాల, 1928

Record no. 630

Vēṅkaṭaśēṣakavi, Anumula, 1905-

Abhinavatārā śaśāṅka vijayamu,

anu, Satītāra

Nandyāla, 1928

Record no. 630

Bibliographic Record Target

వేంకటశేషకవి, అనుముల, 1905-
అభినవతారా శశాంక విజయము, అను, సతీతార / రచయిత అనుముల వేంకట శేషకవిగారు.- 2. కూర్పు.- నంద్యాల : శ్రీవాణీ నికేతన ముద్రాక్షరశాల, 1928.
iv, 50 p. ;21 cm.
Record no. 630

Vēṅkaṭaśēṣakavi, Anumula, 1905-
Abhinavatārā śaśāṅka vijayamu, anu, Satītāra / racayita Anumula Vēṅkaṭa Śēṣakavigāru.- 2. kūrpu.- Nandyāla : Śrīvāṇī nikētana Mudrākṣaraśāla, 1928.
iv, 50 p. ;21 cm.
Record no. 630

ABHINAVA TARA SASANKA VIJAYAM

OR

# SATI TARA

*(A telugu drama in five acts)*

BY

**ANUMULA VENKATA SESHIAH**

TELUGU PANDIT

*Mohemedan Secondary School*

NANDYAL

# సతీతార.

(ఐదంకముల యాంధ్రనాటకము)

శ్రీకావ్యవిశారద, సాహిత్యరత్నాకర, అష్టావధాని,

**అనుముల వేంకటశేషకవి**

కృతిము

నంద్యాల శ్రీవాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రింపబడిరెు.

1928

Price Re. 1.

registered.





ABHINAVA TARA SASANKA VIJAYAM

OR

# SATI TARA

*(A telugu drama in five acts)*

BY

**ANUMULA VENKATA SESHIAH**

TELUGU PANDIT

*Mohemedan Secondary School*

NANDYAL

---

# సతీతార.

---

(ఐదంకముల యాంధ్రనాటకము)

శ్రీకావ్యవిశారద, సాహిత్యరత్నాకర, అష్టావధాని,

అనుముల వేంకటశేషకవి

కృతము

నంద్యాల శ్రీవాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1928

Price Re. 1.

registered.

కవితాసామ్రాజ్యము.



# అభినవ తారాశశాంక విజయము

అను

# సతీతార.

రచయిత,
నంద్యాల మహమ్మదీయ పాఠశాలాంధ్ర పండిత,

**అనుముల వేంకటశేషకవిగారు.**

**Kavya Visharad, Sahitya Ratnakar, Astavadhani etc, etc.**

రెండవకూర్పు వేయిప్రతులు.

**1928.**

నంద్యాల శ్రీవాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితము.

వెల రు ౧-౦-౦.

కవితాసామ్రాజ్యము:



# అభినవ తారాశశాంక విజయము

అను

# సతీతార.



రచయిత,
నంద్యాల మహమ్మదీయ పాఠశాలాంధ్ర పండిత,
**అనుముల వేంకటశేషకవిగారు.**
**Kavya Visharad, Sahitya Ratnakar,**
**Astavadhani etc, etc.**



రెండవకూర్పు వేయిప్రతులు.

**1928.**

నంద్యాల శ్రీవాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితము.

వెల రు ౧-౦-౦.

## హెచ్చరిక.

ఈ నాటకము నాయనుమతి లేక యెవ్వరును ప్రదర్శింపరాదు. ఇందుల కతిక్రమించినవారు తగినచర్యకుఁ బాత్రులగుదురు.

గ్రంథకర్త.

# విజ్ఞాపన.

"శ్లో. కృతిర్మమ నవీనాపి కమనీయా భవేదియమ్,
అప్రౌఢిమా నవోఢేవ రసికానాం కలావిదామ్"

మొదటికూర్పులోఁ దప్పులు కుప్పతెప్పలుగఁ బడినవి. కథావిధాన మాభాస..యముగ నున్నది. పాత్రౌచితి పాటింపనే లేదు. కవిత్వము పైత్యమే. అట్లయ్యుఁ ..లన్నియుఁ జేతులపై నెగిరి పోయినవి. ఇది జరిగిపోయి యిప్పటి కైదారువత్సరము..వి. ఇట్లుండఁగాఁ బునర్ముద్రణకుఁ గొందఱు ప్రేరకులు కలిగిరి. తప్పులు సవరించుట..టెఁ గ్రొత్తగా వ్రాయుటయే యవసరమై, యందెట్లో కృతార్థుఁడ నైతినిగదా యని సంతసించుచుండఁగాఁ బిడుగువంటి యొకయిక్కట్టు సంభవించె. ఏటికో గవర్నమెంటువారీ నా యల్పగ్రంథముపైఁ జర్య పుచ్చుకొని నన్నరెస్టు చేయుటకుగా నొక సి. ఐ. డి. ఇన్స్పెక్టరు నంపిరి. వారు నంద్యాల మీదుగా నెల్లూరునకు వచ్చి, నన్నచ్చుటఁ గలిసికొని, యప్పటి నా ప్రాయమున కాశ్చర్యచకితులై, సంతసము దిగమ్రింగి, యించుక మందలించునట్లు నటించి, తయారైన నా వ్రాతప్రతి నేదో మిషచెప్పి తీసికొని నాడే (4-8-23 శనివారము) రాత్రి రైలుకు చెన్నపురి వెళ్లిరి. వారివిలాస మేదో యొసంగిపోయిరి కాని నాకు సరిగా జ్ఞాపకము లేదు. ఐనను నా వ్రాతప్రతి విషయమై వారికొకటి రెండుత్తరములు విలాసము జ్ఞాపకమున్నపుడు వ్రాయించియుఁ గడకు విఫలమనోరథుఁడ నైతిని.

నేను పట్టిన పట్టు విడువని యొకవిధమగు మొండిపట్టుదల కలవాఁడను కావున నెట్లో ప్రయత్నించి కొన్ని చిత్తుకాగితము లూతగా మఱల దానికొకరూప మేర్పరుపఁ గలిగితిని. దానిని చదువుకొనుట కని యొకకవిగా రడిగి పుచ్చుకొని, "పుస్తకం వనితావిత్తం ............" అనుట సార్థక మొనర్చిరి. అప్పటికిఁ బూర్తిగా హ్రస్వమైన నా యుత్సాహము నుద్దీపింపఁజేసి కొందఱు మిత్రులు తా మీనాటకమును ప్రదర్శింపఁ దలఁచుటను వెల్లడించి వెంటనే నాచే నింకొక నూతనప్రతి వ్రాయించిరి. అదియు మఱియొకరు సంగ్రహించిరి. గౌరవనీయులగు వారిపేరు లిట వక్కాణింప నేటికి?

ఇటీవల నాస్వగ్రామమగుఁ జింతపూడు ( నెల్లూరుజిల్లా కనిగిరితాలూకా )కే నొక యవసరమగు పనికై యరిగితిని. ఎప్పుడో చిన్నతనములో ననుఁగాంచి ..ఱచిన యాగ్రామవాసులు మిక్కిలిగౌరవించిరి. సభ చేయించెద మనిరి. కాని, ..గాకపోయినదో యేమో యట్లు జరుగలేదు. నేను వెళ్లినది మొదలు గ్రామకరణమును, భాస్కరాచార్యులును, నగు బ్రహ్మశ్రీ. అనుముల సుబ్బయ్య గారి,

ఈ నాటకమంతయు వ్రాసి ముగించినపిదప నారాయణసూను శ్రీకృష్ణకవి ప్రణీత తారాశశాంకమును సంస్కృతమునఁ జూచితిని. దానింబట్టి యేమియు మార్పుఁజే..క యాశ్లోకము మాత్ర మిందుంచితిని.

కేరచించిన చమత్కారపద్యములు కొన్ని వినిచి, మఱికొన్ని యప్పటి కప్పుడు రచి చి చదివితిని. వా రానందించిరి. ఒకనాడేదో ప్రస్తావన మరుదెంచెను. అప్పుడు వా నాటకము రెండవకూర్పున కగు ద్రవ్యసాహాయ్య, మొనర్చెద మని వాగ్దానమొనర్చిరి కాని, పర్యవసానము హుళక్కియేయైనది. నాటకము మాత్ర మేనప్పటి కింకను వ్రా యనే లేదు. వెంటనే తత్ప్రియత్న మొనరింపఁ గలిగితిని.

రెండవ కూర్పను పేరే కాని యిది నూత్న రచనయే. ముద్య ప్రకటనలకుఁ బా డవగునని. యీయభినవ తారా శశాంక విజయ మునను, "సతీ-తార" యను నా మాంతర ముంచితిని. కథావిధాన మంతయు మార్చితిని. ప్రాతపద్యము లన్నియు దీ సైచి క్రొత్త వి రచింపఁ గలిగితిని. నాటక లక్షణము మాత్ర మంతగాఁ బాటింప లేద అట్లొనర్చుటకు వీలును లేక పోయినది. సాధ్య మైనంతవఱకు యత్నించితిని. "యత్నే కృతే యదిన సిధ్యతి కో౽త్ర దోషః" అనుట కలదు గదా? అభాస ప్రాయముల కీరనలఁ దీసివైచి పద్యములను మాత్రమే విరివియొనర్చితిని. గానము నాట్యాంగము లొక్కటి యనుట లాక్షణికు లెఱుంగనిది కాదు. శ్లోకములు, పద్యములు గానమ కేర్పడినవే. అందు వలననే వాల్మీకి లవకుశులు రామాయణమును గానమొనర్చ రచించి యున్నాఁడు.

నాటక రచన నాటి కున్న వయసునే ప్రస్తావనలోఁ దగిలించితిని. నాటికేగా నేటికిని సరిగాఁ గవితా ప్రపంచమున ననుభవము చాలమినిందుఁ దప్పు లుండవనుట సాహసింపను. వెండి వెంద్రుకల వారే పెక్కు రుదాహరణ ప్రాయు లైనప్పు డిఁ నిన్న మొన్న కన్నులఁ దెఱచిన నన్ను గూర్చి చెప్పుకొన నేటికి?

ఇఁక నీతి– దుర్నీతి– విషయములలో—

శ్లో. అహల్యా ద్రౌపదీ తారా తారా మండోదరీ తథా,

పంచ కన్యాః పఠేన్నిత్యం మహా పాతక నాశనమ్.

అని తార పంచకన్యలయం దొక్కతెగాఁ బరిగణింపఁ బడినది. ఒక్క శేష వేంకటపతి "తారా శశాంక విజయము" నసేకాక, భాగవతము నందును, పురూ శ్చరిత్ర యందును దేవీభాగవతమునందును, శ్రీనాథుని యొక గ్రంథమునందును నీ వర్ణింపఁ బడినది. వేంకటపతి గ్రంథమునను,

తే. గీ. "ఆయు రారోగ్య కరము జయాస్పదంబు
పుత్ర పౌత్ర ప్రదం బతి పుణ్యదాయ
కం బఖండ మహీలాభ కారణంబు
విను జనంబులకు శశాంకవిజయము" .........

అనిఫలశ్రుతి వచింపఁ బడినది. ఈ విషయమును గూర్చి బ్ర॥ వే॥ తిరుపతి కటేశ్వర కవు లిట్లొకచో వాకొని యున్నారు.

ఉ॥ ............తా టాకుల లోన వ్రాసిరి పఠాంగనఁ
గూడినఁ బాప మంచు............(తారాశశాంక)



"పైపద్యము నిప్పటి వా రనేకులు గ్రహించు చుండఁగా మేము వినియుంటిమి. కవి యుద్దేశము చెప్పన నది సిద్ధాంత వాక్య మెన్నఁటికిని గాదని వా రెఱింగినట్లు తోఁచదు. దుష్ప్రవర్తనాభిముఖురాలగు స్త్రీ వచించు దుర్నీతి బోధక వాక్యమును బట్టి చరించు వారుండరు. ఎంత వ్రాసినను నిది తేలునది కాదు. వేద పురాణ కావ్య ములలోఁ గావ్యార్థ గ్రహణమే కష్టము. ఇందుఁ బదార్థము నెఱుగను సారము వేరు గానుండును. ఈయంశమును గూర్చి లాక్షణికు లెంత యుద్ఘోషించినను ప్రకృత కాల విమర్శకాభాసుల కాగ్రంథ నామములు గూడఁ దెలియని కతన యథేచ్ఛగా వ్రాసి కవులను దూషించుట కవకాశము గలుగుచున్నది."

వినను ప్రభుత్వము వారు మన యిట్టి గ్రంథములపై నేటికాలమున విశేషించి చ ర్యఁబుచ్చు కొనుచున్నారు. కడకు మన శృంగారరసము వారికిఁ బచ్చిబూతుగాఁ గనుపించు కాల మరుదెంచినది. ఆంగ్లమున నిట్టి వెన్నియున్నను దప్పులేదు. శబ్దసారస్య ము గ్రహించిన వారి కింతకంటె నిక్కువమగు పచ్చిబూతులు పెక్కు లందు లేకపోలేదు. "ఒథెల్లో" నాటకము నొకసారి పరికింపుఁడు!

an old black ram is tupping your white ewe. ఈ tupping నకుఁ, "ద త్తకతక తాళమానముల.........," అను నర్థము స్ఫురించును

ఇట్టి వింకెన్ని లేవు? మహాకవి యనియుఁ గాళిదాస ప్రతిముఁ డనియుఁ బా శ్చాత్యులును దత్ భాషాభిమానులు నెన్ను షేక్స్పియర్ అంతటి వాని కావ్యమున నే యిట్టి యశ్లీలములు కలవనిన నిఁక తదితరుల యం దెన్ని యుండనగునో యూహిం పుఁడు! అవియే మన పొత్తములఁ గన్పట్టినచో వానిని దీసివైచి చుక్క లుంపించు లే టిధర్మమో తెలియరాకున్నది. శృంగారమును గూర్చి మే మొకపరి కృష్ణా పత్రికలో

తే. ఎందు నిను గారవము సేసి రింతె కాని
యేప్రభువులైనఁ జుక్క లుంపించినారె
నీదు సుఖమునఁ గృతులందు నిలిచి తనుచుఁ
జీరి నీవెఱుఁగంగ శృంగారరసమ!

అని వ్రాసియుంటిమి. ఏమి వ్రాసినను మనవారికి పర భాషాభిమానము పోదు దేశ భాషాభిమానము రాదు. లేకున్నఁ బాశ్చాత్య దేశములో వలె మనగ్రంథములు కర్చుగుచున్నవా? కావున, శ్లో. "యస్య షష్ఠీ ద్వితీయాస్యా..................ద్వితీయాస్యా మహంకథమ్" వంటి మిడిమిడిజ్ఞానమే మనకుగతి. శాంతం పాపమ్ ఆంధ్ర భాషా వధూటి కట్టిదుర్గతి కలుగకుండును గాక. ఒక్కొక్కపూర్వగ్రంథ మొక్కొక్కరీతి గా నుండుటచే నేను మాత్ర మీనాటకమునం దొకక్రొత్తత్రోవఁ ద్రొక్కినాఁడను. అది కథావిధానము నరసిన మీకే తెల్లము కాఁగలదు. అట్లని తారశశాంకవిజయము దుర్నీతిదాయక మను వారియం దేనొకఁడను కాను. తార యనఁగా "తరత్యనయేతి తారా," యని వ్యుత్పత్తి. చంద్రుఁ డొకగోళమే (Globe) కద? ఇట్టి సందర్భ మున కల్పనాచమత్కృతికిఁ గవిని పొగడవలసియుండఁగా దూషించు టేమిన్యాయమో పాఠకులే యూహించెదరు గాక.

చిన్నతనమువనే ననుఁ బ్రోత్సహించి యీనాటకము బయలెక్కించిన శ్రీమతి

# అంకితము.

తే. సరస మధుర వచస్స్ఫూర్తి సత్యభామ;
శీత లామల శీలంబు చేత సీత;
లలితసౌభాగ్యలక్షిత లక్షణ;— "భ్రమ
రాంబ," కు, మదంబ కొసఁగెద నంకితంబు.

తే. దుర్భరాతీత మగునట్టి గర్భఖేద
మనుభవించియు మముఁగాంచి యంతలోనె
తీరిపోయెను ఋణమైనఁ దీరకుండ;
నట్టిజనయిత్రి కీపొత్త మంకితంబు.

తే. అగ్రహార, తటాక, దేవాలయాది
సప్తసంతతుల్ పెక్కులు, శాశ్వతములు
కామిఁ, గవి కట్టిశక్తియు లేమిఁ, గృతియ
యర్పణ మొనర్చెద మదంబ కంకితంబు.

అ. వేం. శే.



గండ్రకోట సుబ్బమాంబగారి కేనెంతయుఁ గృతజ్ఞుఁడను. రెండవకూర్పున కింతవఱకెవ్వరును దాతలు లేరనియే చెప్పవలయును. వేయేల?

ఉ. పద్దెముఁ జెప్పినన్ వినిసెబాసని మెచ్చరు; మెచ్చిరేనియున్
బెద్దగ గౌరవించ, రొకవేళ గురుత్వముఁ జూపిరేనియున్
ముద్దుగ సత్కృతుల్ కొనిఁ బ్రమోదముఁ బొందరు; పొందిరేనియున్
బద్దునొసంగు పట్లతమబాటను వీడరు నేటినాగరుల్.

చ. సరసుఁడె వందొ నూటికొక జాణకనంబడు నంతెకాని పె
క్కురు విరసాగ్రగణ్యు, లొకకొంచెమ యేనికనీంద్రులందు నా
దరమునుజూపఁ జాలరు; పదంపడి వంకలుదిద్ద నెంతురీ
కరణినిబట్టిచూడఁ గవికంటెను గష్టి మఱొక్కఁడుండునే?

తే. "నీవు పాడుటకును మఱి నేను వినుట
కునుసరే! గాని, శిరమునూపినమదీయ
కష్టమునుగని తంబుకఁగాన్కనొసఁగు!"
మనెడితెఱఁ గయ్యెరసికుల యాగడంబు.

ప్రమాదములు దోషములు సవరించుకొనఁ బ్రార్థితులు.

కవితాసామ్రాజ్యము
నంద్యాల.
12—12—27

అనుముల వేంకటశేషకవి.
గ్రంథకర్త.

## ఇందలిపాత్రములు.

### పు రు షు లు.

సూత్రధారుఁడు.

శశాంకుఁడు. కథానాయకుఁడు.

బృహస్పతి. దేవగురువు.

నారదుఁడు. దేవముని.

ఇంద్రుఁడు. దేవరాజు.

దేవదూత.

### స్త్రీ లు.

నటి.

తార. కథానాయిక.

ప్రభావతి.

వీరుకాక మఱికొందఱు బాలురుమొదలగువారు ప్రవేశింతురు.



శ్రీ.

అభినవ తారా శశాంక విజయము

(అను)

# సతీ తార.

### నాంది.

శ్రీ రాజిల్లఁగ మెల్లమెల్లన నుర శ్రీరాజ్య సింహాసనం
బారోహించి నవీననాటకవిలా సానందసంధాయిఁగాఁ
బ్రేరేపించెడి భావ మంచు నిజనీరేజాక్షి భావించు శృం
గారాకారుఁడు దేవదేవుఁడు జగత్కల్యాణముల్ కూర్చుతన్.

తే. కాకిమూకల యానంద ఘటనమునకుఁ
గాదు నాట్య మటంచు నిగ్రహమొనర్చి
ప్రోడలగు కవిచంద్రులఁ బ్రోత్సహించు
దివ్యశక్తి దేవునిదయఁ దేజరిలుత.

# ప్రస్తావన.

ప్రవేశము. సూత్రధారుఁడు, నటి.

సూ:—మనోహారీ! పండిత పామర హృదయానురంజకమగు నాటకం బెదియేనిం బ్రదర్శింపవలయు. నీ కేమైన జ్ఞాపకమున్నచో నుడివెదవా?

నటి:—సకలసాహితీవేత్త లగు మీ యెదుట- శశాంకునెదుట తారవలె నే నెంతటిదానను?

సూ:—చక్కఁగా జ్ఞాపకము దెచ్చితివి. నేఁడు మన మా తారాశశాంకులకతనే ప్రదర్శింతము.

నటి:—ఏమి? తారాశశాంకులకత దుర్నీతిదాయకము గాక, పండితపామర హృదయానురంజకమా?

సూ:—ఇది యొక క్రొత్త పోకడ. దుర్నీతి యొక్కఁటియు నిందుఁ గానరాదు. అదియును గాక సాధారణముగా—

క. రీతి యగు నీతిపరునకు
నీతియ కనుపించు; దుర్వినీతున కన్నన్
జేతము రీతిం దప్పుట
నీతులె దుర్నీతు లగుచు నెగడుచు నుండున్.

నటి:—అయినను, వీరాద్యన్యరసభూయిష్ఠములగు నాటకము లెన్నియో యుండ నిపుడీ శృంగారపుముద్దనే గైకొననేల?

సూ:—వెఱ్ఱిదాన! దానిరుచి నీ కేమి తెలియును?

క. ఒదవిన శృంగారంబే
యొదవక వలెఁ గాక రస మిఁకొండది యేలా?
చదివిన నాటకకృతియే
చదువక వలెఁగాక లాతి చక్కటు లేలా?

నటి:—సరి! ఈనాటకకర్త యెవరు?



సూ:—మనకుఁ జిరపరిచయుఁడే—

సీ. గోఁచిఁ బెట్టకమున్న లేచి కవిత్వ కా
మిని పని చక్కఁ బెట్టిన ఘనుండు;
నడుగు గాకయుమున్న వడివడి నవధాన
సతిఁ బెండ్లియాడిన సాహసుండు;
బాల్యమైన నొకింత వ్రాలక మున్న భా
షాత్రయీవిదుఁడైన జననుతుండు;
అమరభాషా ప్రవేశమునకు మున్న కీ
ర్తివెలందిఁ గూడిన ధీవరుండు;

తే. గీ. ఎవ్వఁడతఁ? డాశుకవితామహీయరాజ్య
పాలకుఁడు; పదునైదేండ్ల బాలకుండు;

నటి:—ఓహో! తెలిసెఁ దెలిసె.

అనుముల కులాబ్ధి రాకా సుధాకరుండు
కాఁడె? వేంకటశేష సత్కవివరుండు.

సూ:—నీ తెలివి ప్రశంసాపాత్రమే.

నటి:—ఇందు నా తెలివి యేమి? పదునైదేండ్ల వయసునకుఁ గవిత్వము రచింపఁగల వాఁ డొండొకఁ డుండిన గదా?

సూ:—నిక్కువమే! ఉండినను గ్రంథములు రచించి పేరుగాంచినవా రఱుదు. అందును శతావధానము లొనర్పంగలవారు కానరారు. సంస్కృతాంధ్రాంగ్ల భాషా విశారదు లంతకంటె మృగ్యము.

(తెరలో)

తే. గీ. ఇష్టమైనట్టి వెలఁదుల నేరికోరి
పురుషుఁ డెందఱనైనను బొందవచ్చు;
బుద్ధిఁ దెలిసెడివరకైనఁ బూవుఁబోఁడిఁ
యూరకె వివాహమాడక యుండరాదు.

నటి:—(విని) ఎవరది?

సూ:—ఇంకెవరు? తారయే కావచ్చును. మనమిందుఁ దడయరాదు. కాని, ప్రేయసీ! నాటకారంభమున నీ చాతుర్య మరయఁగ లుగుదుఁగదాయని యుబలాటపడుచున్న నాయెదుట నీ ఋతురాజమును వర్ణించి మనంబుఁ దనియింపవా?

నటి:—సమయము చాలదు. అయినను మీ కోర్కెఁ గాదనఁజాల. కానిమ్ము! ఆశుకవి వరేణ్యుని నాటకము కదా యిది?

తే. గీ. మావియను నగ్రపీఠిక పై వసించి
విహఁగసభ్యుల కాశువు వినుచు కోకి
లా కవికుమారు నవధాన మేకదృష్టిఁ
గను సభాపతి ఋతురాజె యనఁగ నొప్పు.

సూ:—ఆహా! స్త్రీలు సహజపాండిత్యమున నెన్నఁదగినవారనుట కీవే తార్కాణము.

నటి:—ఈనుతియంతయుఁ దరువాతఁ గావచ్చు నిఁకఁ బోవుదమురమ్ము!

(నిష్క్రమింతురు.)





# సతీతార.

## ప్రథమాంకము.

రంగము: ౧. బృహస్పతియిల్లు.

(ప్ర॥ తార.)

ఇదియంతయు శాస్త్రకర్తల దోషమే; ఏమనిన?

చ. పురుషులె ధర్మశాస్త్రములఁ బూని రచించినవార లౌటచే
గరితకు భక్తి యిబ్బడి! వికారము బుద్ధి చతుర్గుణంబ; అ
ద్దిర!! యిఁక సాహసం బనక తీరదు; షడ్గుణమంట!!! కామమో?
మఱియును నెన్మిదంత!!!! లని మాపిరి స్త్రీల స్వతంత్ర మందుచేఁ

ఇంక లోకాంతరవిషయమునఁ గూడ కొన్ని దేశములయం దరసి నచో—

సీ. పురుషుండు సతి చని పో సర్వసుఖములఁ
బడయునౌఁ గాంతకుఁ బనికిరాదు;
పుట్టినదాదిగాఁ బురుషుండు చదువులు
చదువఁగా వలెఁ గాంత చదువరాదు;
సర్వత్ర పురుషుండు స్వాతంత్ర్యముం బూన
నౌఁ గాని కాంత మాటాడరాదు;
యిష్టంబు లేనిచో నింతిని పురుషుండు
విడుఁ గాని కాంతకు వెడలరాదు;

తార:—హా దైవమా! ఇట్టివానితో నా మనం బిట్టి దని యెట్లు వాకొందును? సూక్ష్మభంగి నెంత ప్రకటించినను వాఁడు నను గ్రహింపఁ జాలఁడు గదా? చాలకున్న నేమాయె? బలిమి పైకొందునా? పైకొనుట న్యాయమా? న్యాయముకాకున్న నేఁ దాళుదునా? తాళకున్నఁ గులస్థానప్రతిష్ఠలైనఁ జూచికొన నలదా? ఇది నాకు విషమసమయమాయె. ప్రతిష్ఠలు సూచినంతనఁ దమి తీరదాయె. మాటిమాటికి మానసంబునఁ ద్రొక్కులాటలు హెచ్చాయె. వృథాతర్కములతోఁ బ్రయోజనము కలుగదాయె శశాంకా! శ-శాం-కా! హా!

(మూర్ఛిల్లును.)

---

ప్ర థ మాం క ము.

రంగము: ౨. దేవలోకమునందలి మార్గము.

(ప్ర॥ దేవదూత.)

ఇందఱు దేవత లుండఁగా నన్నే యీపనికిఁ బంపుట చూడ మహేంద్రునకు నాపైఁ గల యవ్యాజానురాగము పొడకట్టుచున్నయది. నూరుయజ్ఞములు చేసి శతక్రతుఁడను బిరుదునామము ధరించి నను తన కింకను తృప్తికలుగలేదట! నేఁడో రేపో మరల నొకక్రొత్త యజ్ఞము నారంభింపవలయునట. ఇదిగో! అప్పుడే సూర్యభగవానుఁడు లోకములవంకఁ దొంగిచూడ నున్నాఁడు. విహంగములు తమకులాయముల వీడి యాహారమున కరుగుచున్నయవి. లోకములో నెట్టి యల్పజంతువునకును పొట్టతిప్పలు పెద్దవికదా? వనజములు మరందముల పేర నానందబాష్పములఁ గుఱియుచున్నవి. పిల్లవాయువులు పాంథుల శ్రమ నపహరించుచున్నవి. ఈ ప్రాతఃకాల మెంతహృదయంగమముగా నున్నది?

మ. రమణీయోదయదిక్తటం బనెడి డేరా వీడి వెన్నంటు మే
ఘములకా గూడి దినైకయాత్ర సలుపం గాఁ బశ్చిమాశాప్రబో



దము మీఱఁగా జను మిత్రు సాగనను పకా దర్శించు వారాంగనా
సుమనోజ్ఞాస్య పరీత హాసములు నాఁ జూపట్టుఁ బ్రాతఃకళల్.

అదియే యాంగిరసు పత్తనము. అనుకొనుచుండఁగనే సమీపించితిని. ఇదే పోయి యింద్రుని నన్మానముఁ జెప్పి యాయనను దోడుకొనిపోయి యొప్పగించెదఁగాక.

(నిష్క్రమించును.)

---

ప్ర థ మాం క ము.

రంగము: 3. పాఠశాల.

(ప్ర॥ బృహస్పతి-బాలురు-శశాంకుఁడు.)

బృహ:—శశాంకా! నేఁడు మీ కేమిపాఠము జరుగవలసియున్నది?

శశాంక:—దేవా! నేఁడు కవితాభాగములఁ బరీక్షింపవలసియున్నది.

బృహ:—కవితాభాగముల నేది? ఛందశ్శాస్త్రమా?

శశాంక:—కాదు. సమస్యాపూరణమే.

బృహ:—కానీ! ఏదిరా నీవీసమస్యను పూరింపుము!

"కవితవంటి లలిత కళ హుళక్కి"

1 బా:—గీ. కాళిదాసువంటి కవినాథుఁడు హుళక్కి
రంభవంటి యప్సరస హుళక్కి
తల్లివంటి దైవతం బెందును హుళక్కి
కవితవంటి లలిత కళహుళక్కి.

బృహ:—మంచిది. నీవురా! నీవు నదే పూరింపుము!

2 బా:—గీ. గానమొండె, చిత్రకళ యొండె, శృంగార
రస కవిత్వమొండె రాలనైనఁ
గరఁగఁజేయఁజాలుఁ గాని యందును మేటి
కవితవంటి లలిత కళ హుళక్కి.

బృహ:—మేలు. ఓరీ! నీవు నదే పూరించెదవా?

జూతమటన్న నిమ్మోడలఁ జూడఁదలంపరు సుండు! మిమ్ముల౯.

బృహ:—ప్రేయసీ! ఇంకొకఁ డింకొకఁ డైనచోనట్లే త్రోసిపుచ్చవచ్చును. కాని, యితఁడు ముల్లోకముల కేలిక. అతఁ డింతగాఁ బిలిపించినప్పుడు పోకుండుట లగ్గుకాదు!

తార:—అయిన నే నీ వియోగదుఃఖాగ్నికి శలభంబనై ప్రమందవలసినదేనా? (ఏడ్చును.)

బృహ:—కలికీ! ఊరడిల్లు మూరడిల్లుము! నన్నిపు డేమి చేయుమని యెదవు? నీవే వచింపుము!

తార:—నాథా! ఈ బొల్లియూరడింపుల కేమి? నే నంతమాత్రపుదాననైయుండిన మీరు నన్నీ యాట లాడించియుందురా? అయ్యో! నే నేమివచింతును? నేను కాఁబట్టి సరిపోయినది కాని, యింకొకత్తె యైయుండిన మీగతి యేమికానుండెడిదో?

ఉ. ఊరికిఁ బోవుసంగతి కుహూ యని కర్ణములందు సోకఁగా
వేరొక సారసాక్షియె వివేకిని యై యలరారెనేని బా
జారున బెట్టి సిగ్గు దిగఁజారఁగ దిట్టియు దుంపఁ ద్రెంపదే?
నేరనిదానిఁ జాచుకొని నీ వెగుర౯ దొరకొంటి వీగతి౯.

బృహ:—(నవ్వి) కామినీ! ఇఁకఁ జాలునులెమ్ము! ఎవరైన వినిన నవ్విపోయెదరు.

తార:—నవ్విపోవరా మఱి? ముదుసలియో ముతుకయో, యెవరైన నేమి యని మనఃపూర్వకముగఁ బెండ్లియాడి యొకనాడైన తనివిదీరుసుఖ మనుభవింపకఁ గొన్నినాళ్లు యాగములకనియు, మఱికొన్నినాళ్లు తీర్థయాత్రలకనియు, నింకనుగొన్నినాళ్లు ఘోరతపంబులకనియు నిట్లే పతిని బంపుచున్నందులకు నా కాశాస్తి కాఁదగినదే? లేకుండిన నను వెంటఁ గొనిపోఁదలంపరా?

బృహ:—కోపనా! నీవు వచ్చిన నిచ్చటి యగ్నిహోత్రములగతి యేమి? అతిథుల నభ్యాగతుల నెవ రాదరించువారు? అదియటులుండ నట విట గాయక సమూహపరివృతమగు నమరావతి నీవంటి యువతికి రాఁదగినదా? యోజింపుము!

తార:—(యోజించి) మీ రేమైన ననుఁడు నే నొంటినిట నుండఁజాల.



బృహ:—నే నొక్కటి చెప్పెదను వినుము. శశాంకకుమారు నిం దుంచిపోయెద. బాలుఁడయ్యు నతఁడు తెలివిని నను మించినవాఁడు. కావున నతనిచే నీకుఁ గావలసినపనులఁ గొనుచు నెట్లోసి కాలముఁ బుచ్చుచుండుము!

తార:—(స్వగతము) అంతరంగమునందలి సంతసమా! కొంచెమాగుము. (ప్రకాశముగ) నాథా! మీ రిట్లుపలికిన—

బృహ:—ఇఁక మాటలాడిన నీకు నా యాన కలదు. నా వచనంబులకుఁ బ్రతివచనంబులు పలుకక శుభోదయముగఁ బైనంబుఁ బంపుము. ఇఁక పతివ్రతాధర్మముల నీ వెఱుంగని నీతి, నిర్ణీతి లేదుగదా?

గీ. నిజవిభుం డింట లేనిచో నెఱుకలైన
దువ్వరాదు; పూసరులేనిఁ దుఱుమరాదు;
చూడరా దన్యునెడ మాట లాడరాదు;
చూడు మెట్లుందువో యింక సుదతిమిన్న!

తార:—సరే కాని, యాగమైనపిదప నొక నిముసమేనియు—

బృహ:—నిముసముకా దరనిముసముమాత్ర మేఁ దాళుదునా? వెంటనే తెక్కలుకట్టుకొని నీ సరస వ్రాలెద. నా కానతిమ్ము. శశాంకునిమాత్ర మేమఱక శ్రద్ధగాఁ జూడవలయును.

తార:—మీ రంతి చెప్పవలయునా?

తే. ప్రాణపదముగ గౌరవ పఱచుదాన
మఱిమఱి శశాంకు నాత్మ కుమారువోలె;
మీకుఁ బ్రియుఁడట! నేనేల నాకుఁ బ్రియుని
సలుపుకొనకుందుఁ? జనుఁడు విచార ముడిగి!

బృహ.—అబ్బ ఇప్పటికి నాచిత్తము కుదుటఁబడినది. ఇల్లు గనిపెట్టుకొని భద్రముగ నుండుము! ఇఁక నాకు సెలవా?

తార.—సుఖముగాఁ బోయిరండు! (సాగనంపి) ఇంక నాయదృష్టము పండినట్లే. ఈకపటనాటక మెట్లో నిర్వహించితిని. కానీ! ఇంకను ప్రథమాంకమే కదా? ఇదేపోయి శశాంకుని వెదకి మనోరథసిద్ధి వడయుదునుగాక. (నిష్క్రమించును.)

---

### రంగము ౧. అమరావతీమార్గము

(ప్ర. నారదుఁడు (గానమొనర్చుచు)

### † గేయమ్.

భజమానస! శ్రీధరపాదం మునిబృందమనోజ్ఞవినోదం
మణినూపురితాఖిలవేదం హాత సజ్జన లోక విషాదం.
కమలా కుచ కుంకుమ శోదం కరుణా భరణాన్విత మోదం

అదేమోకాని నాకీ కలహాశనత్వము పొమ్మనినను బోననుచున్నది. ఈహరిభక్తి లేకున్నను బ్రదుకవచ్చునేమో యెఱుంగనుగాని కలహములులేకుండిన బ్రదుకు సాగదనియే తోఁచెడిని. అందులకై యనవరత కలహాంకురాన్వేషణార్థము జీవితమంతయు వ్యర్థమొనరించుచున్నాఁడను. అదేమి ప్రారబ్ధమో! నా కీసంగతులు తెలియకుండవలెనన్నను దెలియకుండవు. శశాంకునకు జవ్వనము ముకురించినది మొదలు తార, మోహవివశావతారయై తపించుచున్నది. పాప మీహార్తకర్ణములందుసోకనావృద్ధబ్రాహ్మణుఁడేమగునోకదా? శశాంక బృహస్పతులకిది కలహకారణమే. కలహకారణమని తిన్నఁగా ననవేటికి? నాకుఁ బ్రబలానందదాయకమే! ఛీ! ఇది జరుగనేజరిగిన ముందు నాయానందమున కేమిగాని, దేవలోకమునకే— దేవ జాతికే— యీ కృతయుగమునకే యపకీర్తికరము కాదా? ఇంతకు మూలకారణుఁడనే నగుదుఁగదా? నేనులేకుండిన కలహ ముండియేమి? లేకయేమి? ఎన్నివిధములఁ జూచినను నా కీపద్ధతి యంతబాగుగాఁ దోఁచదు. సర్వసుపర్వసర్వ్యల కొజ్జయు— మహాపాన్నతిపదవులకెల్ల సెజ్జయు— నగు వేల్పుటొజ్జ కిట్టిదుర్గతి కూడునా? అంతటివాని కులపత్ని వేశ్య కాఁజెల్లునా? ఇంతకంటె భూలోకమున వేశ్యలకుఁ బెండ్లిండ్లువలయు ననుకలియుగమే వేయిరెట్లు మేలనిపించుఁ గదా?— అయిన నిట్లొనర్చెదఁగాక. దేవగురుఁ డిప్పుడీదారినే యమరావతి కరుగపలసినచ్చును. అతని కీవిషయము మెఱింగించి యెల్లైన నింటివంక మరల్చి పంపెదఁగాక. అదుగో! అనుచుండఁగనే యతఁడిటే వచ్చుచున్నాఁడు. రానీ! (ప్రకాశము బిగ్గరగా)

† మొదటిపాదము పల్లవి.



ఓహో, ఆంగిరసా! అనుకొనుచుండఁగనే వచ్చుచున్నాఁడవు. నీకు శుభమగుఁగాక.

(ప్ర. వెంటనే బృహస్పతి)

బృహ—ఓహో! నారదా! అభివాదనములు.

నార:—అభివాదనములు. ఎచ్చటకుఁ బ్రయాణము?

బృహ:—ఇదేమి? నీవెఱుఁగవా? అమరావతి కరుగుచున్నాఁడను. నీవు యజ్ఞమునకు రావా?

నార:—రాకేమి? నీ వొక్కఁడవేనా? ఇంకెవ్వరైన నున్నారా?

బృహ:—నే నొక్కఁడనే. మఱెవ్వరును లేరు.

నార:—ఎవ్వరును లేరా? ఆదూరమున నెవరో నిలచినటులున్నదే?

బృహ:—అతఁడు శశాంకుఁడను నా శిష్యుఁడు——

నార:—వానింగూడఁ గొనిపోయెదవా?

బృహ:—లేదు లేదు. వాఁడింటి కరుగును. ఇంతవఱకు నను సాగనంపుటకై యరుదెంచెను.

నార:—దేవగురూ! పెద్దవానికి నీ కేటికీకష్టము? అమరావతి కాబాలునే యంపి నీ వింట నుండకపోయితివా?

బృహ:—నారదా! నీమాటలు వింతలుగా నున్నవే! ఇంద్రుఁడు నన్నే రమ్మనఁగా నే నీబాలు నెట్లంపుదును? అంత తప్పనిసరి యేమి సంభవించినది?

నార: సంభవించుటకేమి? సరే! నీయిష్టము కాని, నాకేమో నీవు పోవుటంత లగ్గనితోఁచదు. పోనీ! నీవేషము నతనికిచ్చిపంపి నీవు కామరూపుఁడవగుట నతనివేషమున నింట నుండరాదా!

బృహ: నీమాటలు నా కర్థముకావు. అంతటిపని యేమున్నదని యిట్లనుచున్నావు?

నార: ఉన్నది. ఎంతయో యున్నది. అది నేఁ జెప్పినట్లొనర్చిన నీకే తెల్లముకాఁగలదు.

బృహ: ఏమి? నారదా? ముసలివానిం జూచికొని నను వెఱ్ఱాటలాడించుచున్నావా? నాకుఁ దెలియనిపని నాకేమికలుగునని నీవిటులనుచున్నాఁడవు?

నార:—కలుగఁగలదు. నేవచించినఁ గోపింపవుగదా?

బృహ:—కోపమేమిటికు? వచించెడిదేదో వచించి వెంటనే నాచిత్త క్షోభ మాన్పుము.

నార:—వచించినను నీచిత్తక్షోభ మానునదికాదు. (చెవిలోఁజెప్పి) తెలిసినదా?

బృహ:—(సందేహముతో) ఇంతటి యన్యాయముండునా? నేను నమ్మఁజాల. ఇం కెవ్వరితె విషయమైన నేమోకాని తారమాత్ర మంతటి యవినీతకాదు.

నార:—వినీతయుఁ గాదు. వెఱ్ఱివాఁడా! లోకమునందలి మగవారిలోఁ దమభార్యలయం దింతటినమ్మకము లేనివారెవ్వరు?

చ. నడవడిచెడ్డదైన నవనాగరముల్ మిడిమేలముల్ కడుం
గడుఁ బచరించి నిశ్చయము గాఁ దమ యబ్బలనాఁడుఁగూడ నె
క్కడఁ గననట్టి కీల్గము లె గాదిగ నారులు పన్నఁగాఁ దగు
ల్వడి వలలందు సర్వమును బాడొనరించెడివారు లేరొకో?

స్త్రీలవృత్తాంత మిా వేమెఱుంగుదువు?

బృహ:—ఎఱుఁగక కాదు. నా ప్రయాణసమయమున,

తే. "ప్రాణపదముగ గౌరవ పఱచు దాన
మఱిమఱి శశాంకు నాత్మ-కు మారువోలె"

నని యింతమనశ్శుద్ధితో నొడివిన దిట్లుసేయునా యను సందేహ మున న్నెడఁబాయకున్నది.

నార:—ఎట్లెట్లు? ఆమాటవలన; "నాత్మకు—మారువోలె" నని యు స్ఫురించుఁగదా?

బృహ:—(యోజించి) అవును నిక్కువమే? అయిన నిఁక వేఱుమార్గ ము పనికిరా దనియెదవా?

నార:—చిన్నగా నడిగెదవా? ఇప్పటికే యామె యెట్లాందోళన పడు చున్నదో? పోయి చూచిన నీకే తోఁచకపోదు.

బృహ:—అయిన నిప్పుడే పొమ్మందువా?

నార:—నీ యిష్టము. అది నే నెట్లుచెప్పుదును? నాయూహకు నీ కేమి చెప్పుట మంచిదనుకొంటినో యది యీవఱకేవచించితిని. ఇఁక



నే నేఁగెద.

బృహ:—నారదా! అట్లయిన సరిగావచింపకయే నను నట్టేట ముంచి పోయెదవా?

నార:—ఇది యొకరివచింపఁదగినది కాదు. నీ కేవిధియుక్తమో య ట్లొనర్పుము. నాకుఁ బోవలయు. (గానమొనర్చుచు నిష్క్రమిం చును.)

బృహ:—(ఏకాంతముగా) ఇప్పుడు నా కెట్లును దోచకున్నయది. ఈ నారదునివచనములు యథార్థము లందునా? కాదందునా? కా కుండుట కితని కేమి నా పైఁబగయా? ఏమో యీతగవులమారిని నమ్ము టెట్లు? సరే! తినఁబోవుచు రుచు లడుగ నేల? గృహమున కే పోవుదునా? అయ్యో ఇంద్రునియింట యజ్ఞమే? దాని నా శ శాంకుఁడు నిర్వహింపఁగలఁడా? నిర్వహింప కేమి?— ఒకవేళ నిర్వ హింపకయే పోనిమ్ము! ఆగోల నా కేల? ముందు నాసంగతి నేఁ జూచికొనవలయుఁ గదా? ఆ-హా! తలఁచుకొనినంతనే నా కెట్లో యగుచున్నయది. ఇపు డేమని యింటికేగుదును? ఏగుదునుపో! దానిమొగ మెట్లుచూతును? చూతునుపో! ఎట్లు మాటలాడు దును? ఇదేమి? ఇంకను నావిషయమందు నిజానిజము లెఱుం గరావుగద? కానీ! నేను శశాంకవేషమున నింటికే చనియెదఁ గాక. ఆశశాంకుఁడే నా వేషమున యజ్ఞనిర్వహణార్థ మమరావతి కరుగుఁగాక. నిజము నిలుకడమిాదఁ దెలియదా? ఇఁక నేనిందుఁ దడయఁదగదు.

(నిష్క్రమించును.)





# సతీతార.

## ద్వితీయాంకము.

రంగము ౧. బృహస్పతియిల్లు.

(ప్ర. బృహస్పతి (శశాంక వేషమున)

ఈపాటికి శశాంకుఁ డమరావతి కరిగియుండనగును. నారదుఁడే నాపాలిటి మహోపకారియై వచ్చియుండనిచో నాకిట్టిసంశయమునకే యవకాశ ముండెడిదికాదు. సంశయమే యుండిన నే నీవఱకే దాని ముచ్చుమాపి యుండకపోవుదునా? అయినను నాకీవిషయమున నింకను దగినంతసాక్ష్యము లేదు. సాక్ష్యముల కేమి? కన్నముత్రవ్వుచుండఁగాఁ జూచిన దొంగకు, వానిదొంగతనమునకు "సాక్ష్యము సాక్ష్య," మనియే భారతదేశ మధోగతిపాలైనది. కానీ! ఇప్పుడీచర్చయంతయు నేటికి? కొంచముసేపటికదే తెలియుఁగదా? (పరికించి) అదిగో! అదియే యిటు వచ్చుచున్నది. ఇఁక నొక్కమాటయు వ్యత్యస్త మొందనీయరాదు.

తార:—(ప్రవేశించి) శశాంకా! ఇంతవర కెందేగియుంటివి?

బృహ:—(స్వ) ఏమి చెప్పుదును? (ప్రకా) గురుని సాగనంపఁ బోయియుంటిని.

తార:—ఓయీ! నీవుగదా నాకు మెచ్చువచ్చువాఁడవు? నీగురుఁడు దూరముగ సాగిపోయెనా?

బృహ:—ఆ—

తార:—ఆయనకు సంసారభ్రాంతి మిక్కుటము. మరలి రాఁడుగదా?



బృహ:—(స్వగ) వచ్చియేయుండఁగా రాఁడని యెట్లందును? (ప్రకా) ఏమో? అని నే నెట్లు చెప్పఁగలను?

తార:—పోనీ! ఒంటిపాటు చేకూరినదిసుమా! నను కూరిమి నాదరింపవలయు. దారిలో నీగురుఁ డేమియు నసంతృప్తిఁ జూపఁడు కదా?

బృహ:—(స్వగతము) దీని కేమనవలయు? (యోజించి) ఓహో! ఇల్లు కాఁగూడదా? ఇంతకే త్వరపడరాదు. (ప్రకా) అసంతృప్తి యను మాటయే లేదు.

తార:—సంతోషము. అయిన నేడిక శిరస్సుమజ్జనమున కనుమతింతువా?— ఏమి యోజించెదవు? ప్రొద్దు పోయినదనియా?

బృహ:—ఏమియు లేదు. అనుమతించునంతటివాఁడనా?

తార:—అయిన నూనియలఁ గొని తెచ్చెద నీవీపచ్చలగద్దియపై నాసీనుఁడవుకమ్ము! (పోయి నూనియలతోఁ బ్రవేశించి) ఇది సంపెఁగ తైలము. ఇది నిమ్మపండ్లరసము. ఇది భృంగామలకము. కూర్చుండుమాలస్యమెందులకు?

బృహ:—(కూర్చుండును)

తార:—(తల యంటఁ దొడఁగును)

(అవనిక పడును)

---

## ద్వితీయాంకము.

రంగము ౨. భోజనశాల.

(శశాంక వేషమున) బృహస్పతి (భుజించుచుండ)

తార (ప్రక్కను పూసురటి వైచుచుండును)

తార:—ఘృతము వలయునా?

బృహ:—వలదు. (స్వగ) కానీ! ఇంకను బరీక్షించెదఁగాక.

తార:—ఏదీ! ఆఆరసాయనములు రుచిఁజూడుము నీవచోమాధురికె నయగునో కావో? (సంశయాస్పదముగఁ జూపు సారించును.)

గౌతమసతి పాతకము చేతఁగద దేవ
కాంతుఁడు మేనెల్ల గన్నులఁగాంచె?
బృందఁ జెందిన పాపకందంబుచేఁ గదా
యిందిరాపతి శపియింపఁబడియె?

(స్వగతము) ఇ దెట్లుచెప్పుదును? (ప్రకాశముగ)

పదినేఁ గూడినయఘం బెదఁ జూచికద గురు
వేసను నీ విటు గాటుదేలి యుంట?
యంతలంతమహాత్ముల యట్టివారి
కైన బాధలు తప్ప లే దనఁగ నింత
కకట! మనబోంట్లదుర్గతి యడుగనేల?
సుంత యోజింపుమా నేడు సుందరాంగి!

తార:—అక్కటా! మదనరూపవైభవా! నీ కిసుమంతయు జాలివొడమదుగా?

ఉ. చెక్కులువెల్లనయ్యె నిదె చెచ్చెర గుండెలుకొట్టుకొంట నే
దిక్కునుదోపదయ్యె నిఁక దీర్ఘముగా బ్రతిమాలఁజాల న
న్నక్కునఁగారవించి మధు రాధర మించుకనొక్కి కన్గవ
స్రుక్కనొనర్చు చుంబనల సోనలుగాఁగురియించి మ్రొక్కెదన్

బృహ:—ఛీ! ఛీ! పొమ్మావల! ఇది కేవల ధర్మేతరము.

తార:—పన్నెకాఁడా! వలచివచ్చిన మచ్చెకంటి నిచ్ఛగింపకుండుట ధర్మేతరముకాదా? ఈ ధర్మములకేమి? అబలలమనోరథములార్పఁజాలని వెడఁగుమానిసులచే రచింపఁబడినవిసుమా—యీ ధర్మశాస్త్రములు!

బృహ:—ఓహో! నీ తెలివి యంతకంతకు ముదురుచున్నదే? ఇట్టి వాచాటులు కొందఱు బుద్ధిమంతుల మహాగ్రంథముల కపార్థములఁ గల్పించుచుందురు. ఇఁకఁజాలు నిలుపుము! ఈపాపమునకు నే నొడంబడఁజాల.

తార:—నీ విదిపాపమనిన నే నీమదనతాపమున కోపఁజాలనే? అప్పుడాపాపమున కేమిచేయుదువు? ఈపాపమున కెట్లైన భరించెదనన్నప్పు డీయసువుల నిల్పినపుణ్యము నీవు వహింపనేరవా? ఇట్టివెడగువని యెక్కనాఁడుఁ దలంపను. **కవితయు వనితయు** వలచిరా వలవదనువాఁ డుండునా?

తే. సరస మధుర కవిత్వంబు సతియు వలచి
వచ్చినదె పదివేలను నిచ్చలేక
వలదనెడి బుద్ధిహీనవుఁ బంద నెందు
నైన విని కని యెఱుఁగుదుమా? వచింపు!

ఎట్టి బెట్టిదంపుఁబలుకుల కవకాశ మిచ్చితివి? షోడశకళాప్రపూర్ణమై సుధలూరుచుండు నీ సుందర వదనారవింద సందర్శనమాత్ర నెట్టి పతివ్రతాతిలకమునకైన నానందము డెందమున డిందిచిందకుండునే? ఊరకరమ్ము! నీ పెదవిపానక మానవిమ్ము! కమ్మతెమ్మెరలఁ జిమ్ము శరీరమ్ము నొక్కపరి నా కందనిమ్ము! ఇఁక మాఱువల్కక నా మనోరథ మించుక తీరనిమ్ము! ఏల దూరము చూచెదవు?

(పైఁబడి కౌఁగలించును)

బృహ:—(తెల్లబోవును.)

(అవనిక జారును)

---

ద్వితీయాంకము.

రంగము: ౧. బృహస్పతియిల్లు.

ప్ర. నిజస్వరూపమున బృహస్పతి.

దుర్భరము. దుర్భరము. హృదయమా! నీ వింకను పాషాణసదృశవై యేల పగిలిపోకున్నావు? అనురాగమా! నీ వెందుల కింకను నాలోనుండి పారిపోఁజాలవు? నారదా! నీవుగదా నన్నీ సంకటములపాలొనరించిన కఠినాత్ముఁడవు? లేకుండిన నే నిదియంతయుఁ జూచియుండను—కడకు వినియైన నుండనుగదా? మొన్నరాత్రి నే నేవిచారమును లేక హాయిగా నిదురించియుంటినే? ఆసమయమున నే నీకుటిలహృదయమున నున్న శశాంకు నారయనే? ఇప్పుడేల?— అయ్యో! ఇప్పుడు నాకుఁ గర్తవ్యమేమి? కత్తినైన దానిని పొడిచివేయుదునా? తుపాకినైన

ప్రేల్చివైతునా? అగ్నికీలనై కాల్చి భస్మమొనర్తునా? రాక్షసుఁడనై చలిచీమనట్లు నేలఁజముదుమనా? మృత్యువునై పాశముల బంధింతునా? లేక నరకరూపమునై యట్టి కూలఁద్రోయుమనా? కాక నేనే సంసారముఁద్యజించి యడవులకేగుదునా? సన్యాసినగుదునా? అయ్యో! ఈ బ్రమునకునకంటె చావే మేలుగదా? చూచిచూచి యెట్లు చావనగు? ఏమైనఁ గూపముఁజూచి పడిపోవుదునా? నాకేమి వెఱ్ఱి యిది? దేవతల కెట్లైనఁ జావు కలదా? అయమరత్వమునుదుఃఖకారణమే యయ్యెనా? చావునకై తపంబొనరింతునా? ఇది బ్రహ్మదేవునకుఁ గూడ తెలియును కాబోలు! ఆయనకుఁ దెలియనివిషయము లున్నవా? అయినను నేనై బయటబెట్టినట్లగుఁగా? ఆవంత దానికే యుండిన నింతవరకు రాదుకదా? అది యెకవేళ నవివేకినియైన నాకేని వివేకము వలవదా? దుఃఖము. దుఃఖము. భూమ్యాకాశము లొక్కటియై నను నలచిచంపినను— కారాని యకార్యములన్నియు నొక్కట నాపై వర్షించి యవమానముల పాలొనర్చినను— జగముల్లెల్ల శపించి యధోలోకముపాలొనర్చినను— నే నింత విచారింపను. నేనేకాఁబట్టి సరిపోయినది కాని లేకుండిన పుంశ్చలీస్థితి నీదుండగి యెంతచేసియుండునో? ఆసుకుమారుఁ డెంత పరితపించియుండునో? వానికి నిట్టియభీష్టమే యుండదుగా? పాపముశమించుగాత. ఓ దేవలోకమా; నా కింక సెలవా? మాటాడవేమి? అవివేకమా? స్వర్లోకమా! తారా— తారా— ఎట్లు తాళుదు? తారా! మోహవికారా! దుర్మాంస నసాదికారణ నిస్సారా! హా! (మూర్ఛిల్లును.)

---





# సతీతార.

## తృతీయాంకము.

రంగము ౧. అదేగృహప్రాంతము.

ప్ర. నారదుఁడు, (గానమొనర్చుచు)

శ్లో. ధర్మావనైకగుణ శూర దశావతార!
దుష్టప్రజా నిహితవీర! వివేకసార!
సర్వాభిధానచయ ధార! విమోహదూర!
ధీర! స్తునోమి నిజ భక్త మనో విహార!

తుదకీబృహస్పతి గతి నేనన్నంతయే యైనది. ఏల కాకుండును? తారయేమి సామాన్యయా? పాప మతఁడీనాఁడు ప్రొద్దుటనే యెరితో ననకుండ నిల్లువిడిచి పోయెనట! అందులకే యీపురమెల్ల నట్టుడికిన ట్టుడికిపోవుచున్నది తారయేకాక తక్కినవారుసయిత మాతని నింకను శశాంకుఁడనియే తలంచుచున్నారు.

(తెరలో)

తే. గీ. అక్కటక్కట: నా మనోహరుఁడు లేని
యెడల మగఁడేల? సంసార మేల? యీప్రప
పంచ మింకేల? భాగ్య వైభవ సుఖమ్ము
లేల? తను వేల? ప్రాణమ్ము లేల నాకు?

(విని) అదిగో! ప్రత్యక్షముగాఁ దారయే యతనింగూర్చి వాపోవుచున్నది అతఁడెందరికానో తెలియరాదు. కాని నా కించుక శాంతి దొరికినది— అయ్యో! ఎక్కడ శాంతి? కలహములు కలుగక యే శాంతియా?

(మఱలఁ దెరలో)

తే.గీ. ఘోర! యెంతటిదుర్మార్గుఁ డైనను గురు
పత్నిఁ బట్టి రమింపఁగాఁ బాలుపడునె?
చంద్రుపై నింద్రుఁ బురికొల్పి సమరమునకు
దేశికోత్తముఋణమును దీర్చువాఁడ.
ఎవరది?.................అబ్బాయీ! నీ వెవ్వఁడవు?

(ప్ర. వెంటనే ఒక బాలుఁడు.)

బా:—అయ్యా! నే నెవ్వఁడ నైన నేమి! అమరావతికి దారిచూపి పుణ్యముఁ గట్టుకొందురా?

నార:—అంత చెప్పఁగూడనిపనియా?

బా:—లేదు నట్టిదియే- కాదు. కాదు- తా మెవరో నే నెఱుంగను. చెప్పవచ్చును; దానికేమి? క్షమింపుఁడు. చెప్ప వలసినది...కాదు.

నార:—మీ రెవ్వఁడో నన్నుఁగాంచి భీతిలుపగిదిఁ గన్పట్టెడిని? ఓయీ ఇటురమ్ము! నేనునారదుండను దేవమునిని. నీ వేమియు భయ మందనక్కర లేదు.

బా:—ఓహో! మునిచంద్రా! నమస్కృతులు. నేను బృహస్పతిశిష్యులలో నొకఁడను. ఇప్పు డొక యవసరమగు పనిపై నమరావతి కరుగుచున్నాఁడను.

నార:—వాంఛాఫలసిద్ధిరస్తు. ఆ పనియేమో నాకుఁ దెలియరాదా?

బా:—తాము దివ్యజ్ఞానులుగదా? తమదివ్యదృష్టిచేతనే పరికింపుఁడు!

నార:—(చూచి) సరిసరి. ఇప్పు డరయఁగలిగితిని. నీవు చంద్రునిదుర్మార్గము నింద్రునకుఁ దెలుపఁ బోయెదవుగదా?

బా:—మునివర్యా! క్షమింపుఁడు. నిశ్చయమే.

నార:—(యోచించి) కానీ. ఇదియు నొకందులకు మంచిదే. (ప్రకా) ఓయీ నీవు తలంచినకార్యము మిగుల శ్లాఘనీయము. త్వరితగతి నరిగి కార్యసిద్ధినిబొందు. రమ్ము! పొమ్ము! ఇదియే యమరావతీమార్గము.

బా:—ఇదియేనా?.................



నార:—అవును. ఇట్లే యరుగుము

బా:—కృతజ్ఞుఁడను. (నిష్క్రమించును)

నార:—భళి! ఇట్లుగదా యుండవలయు కడకిది కలహభాజనమేకాఁగలదు. నాకిఁక కనులపండువుగదా?

(గానమొనర్చుచు నిష్క్రమించును.)

---

## తృతీయాంకము.

### రంగము ౨. మార్గమధ్యము.

ప్ర. (బృహస్పతివేషమున) శశాంకుఁడు.

సీ. నేడుగదా గురు నిర్ణీత వ్రతా కా
ర్యాచరణుండనై యలరినాఁడ?
నేడుగదా సర్వ నిర్జర స్తవనీయ
గుణ విరాజితుఁడనై తనరినాఁడ?
నేడుగదా సుక లాఢంబర విడంబ
మాన తేజుండనై మలసినాఁడ?
నేడుగదా సురా నీకాధినాధ సే
వితపదాబ్జుండనై వెలసినాఁడ?
నేడుగద గురుయశో మూగు లాడకుండ
నిలిపి, శిష్యునికృత్యంబు సలిపి, జగము
లన్నియును నుతించునప్పద మందినాఁడ?
రాజనెడిపేరు నాకు సార్థకము కాఁగ.

ఇంక నాకీవేష మెందులకు? (తీసివైచి) ఇప్పుడు నేఁ గృతకృత్యుఁడనైతిని. ఎంతైనను గురుప్రఋణము తీరదుకదా?

చ. కడుపునఁగన్న నందనుల కంటెను ప్రేమమెడిఁ జూచి యోదనం
బిడి, చదివించి యెల్లపుడుఁ బిల్లలసౌఖ్యమె ముఖ్యమంచు నో
త్తిడిఁగొని, జీతబత్తెములఁ దీసికొనక వలదంచు లోఁ దలం
చెడి మహనీయమూర్తి గురుశేఖరుఁ డప్రతిమానుఁడు కాఁడొకో?

(తెరలో)

ఎవ్వరైన నిట శశాంకునిజాడ తెలుపువారున్నారా? ఏమి యెవ్వరును లేరా?

శశాంక:—ఎవ రక్కడ? ......(సరికించి) ఎవరో జోగురాలుగా నున్నదే?

చ. పెదవుల వన్నె:—యెయ్యడల బెత్తె డెడం బగుపట్టుసీక మైం
గదరు విభూతి రేకలు;—ముఖంబున లప్పడుబొట్టు; నెత్తిపైం
జెదరిన కెంజడల్;—చనుల చెంగళులకా రుదిరాక్షపేరు; లి
మ్మదవతిజోగురాలనుచు మాటికిం జూచెడు రీతి నొప్పెడిన్.

తటాలున జూచువారలకు జోగురాలె! ఏనను సూక్ష్మదృష్టిం బరికించువారి కీమె నిక్కంపుయోగిని కాదని తోపకుండదు. ఇందాశ్చర్యమేమి? లోకమంతయు నిట్లేకదా?

తే.గీ. బూటకంబునకై కావి పుట్టము గట్టి
పైంబయినిజూడం బెద్దల వలె నటించి
కుత్సితములకు గుత్రలకును నిధులగు
వారు లెక్కింప నెందఱు లేరు నేడు?

ఓహో! ఆమె సమీపమునకే వచ్చినది. రానీ! సకలము నిప్పుడే తెలియంగలదు.

(ఇంతలో) ప్రవే. ప్రభావతి.

ప్రభా:—ఇం దెక్కడనైన శశాంకుం జూచినవారు కలరా? పలుకరేమి?

శశాంక:—ఇదేమి నన్నే యడుగుచున్నదా? —అమ్మా! అగుపడెను. కాని మీరెవరో కరుణించి నొడివెదరా?

ప్రభా:—అగుపడెనా? ఎక్కడ?

శశాంక:—అదియంతయు దఱువాత నెమ్మదిగా వచించెద. ముం దీసంగతి చెప్పుడు మీరు——

ప్రభా:—అయ్యా! నేను ప్రభావతి యనుదానను. మాయది భారతదేశమునందలి కాశీనగరము. త్రిలోకసంచారిణి నగుట నేనప్పుడప్పుడీ బృహస్పతియింటికి వచ్చుచుండుట కలదు.



శశాంక:—అవును మిమ్ముంగూర్చి నేనును పలుమాఱు వినియుంటిని. ఇప్పుడు మీ వచ్చినపని యేమి?

ప్రభా:—అట్లయిన శశాంకుడ వీవేనా? వెదకంబోయిన దీవయు కాలం దవిలినట్లయ్యె. పోదము రమ్ము! ఆముద్దులగుమ్మ నీకొఱ కెంత పరితపించుచున్నదో తలపోయవైతి కదా?

శశాంక:—ఇదేమి? ఆశ్చర్యముగా నున్నదే! ముద్దులగుమ్మ యెవరు? నే నెవరు? నీ కేమైన మతిభ్రమ కలిగెనా? నేను శశాంకుడను సుమా!

ప్రభా:—అవును. శశాంకుడవనియే చెప్పుచుంటిని నీ వేమియు నెఱుంగవా? అట్లయిన నీకొఱకు నన్ను మాసఖి పంపుటయే తటస్థింపదు.

శశాంక:—మీ సఖి యెవరు?

ప్రభా:—ఎఱుంగనివారి కేల చెప్పవలయు? నీవు శశాంకుడవేనా?

శశాంక:—ఆ- హా- త్రికరణశుద్ధిగా—

ప్రభా:—అయిన, గురుపత్నిని తార నెఱుంగుదువా?

శశాంక:—అయ్యో! ఎఱుంగ కేమి? ఆమె నాకు——

ప్రభా:—సరే! ఆమె నీకో—నీ వామెకో—అదియంతయు నాకక్కఱలేదు. ఆ తారయే నిను బిలిచికొని రా నాజ్ఞాపించియున్నది. వచ్చెదవా?

శశాంక:—రాక యేమి? గురుపత్ని యాన మీఱుదునా?

ప్రభా:—గురుపత్నియో— మఱియే పత్నియో? ఆ విషయము నిర్ధారణ మిప్పుడేమి? వచ్చెదవేని వెంట నేగుము!

శశాంక:—ఇదేమి? యీమె చాల పొగరుబోతువలె నున్నదే? కానీ! ఆ గురుపత్నితోడనే చెప్పి యీమెకు దగిన ప్రాయశ్చిత్తమొనర్పించెదంగాక—సరే! పోదముపద.

(నిష్క్రమింతురు.)

———



# సతీ తార.

## చతుర్థాంకము.

రంగము. ౧. ఏకాంతగృహము.

ప్ర. తార (విరహమున)

అక్కటా! తుహినధామా! సకలకువలయాభిరామా! శ్యామా మనఃకామా! సరసజన వినుత సద్గుణాభిరామా! శృంగార రసోద్దామా! వైరిజనవిదార భీమా! రాజ కులోద్దీపిత సీమా! భామా మనోల్లాస నామా! కుసుమాస్త్రమామా! సునామా! మహాబాహుబలస్థేమా! చంద మామా! ఎందున్నావు? నిన్నిఁక నే నీజన్మమునఁ జూడఁగలనా? నేను నిక్కముగా స్వయంకృతాపరాధను ...కాదుకాదు.......ఎట్లు వచించుటకును వీలులేదు.

ఉ. ఇందులకేసుమా విబుధు లింతుల స్వేచ్ఛకునై వివాదముం
బొందుట!—స్వేచ్ఛయున్నఁ జెడి పోవునె యెన్నఁటికైనఁ గాంత? లో
నం దయలేక పూరుషులు నారుల బీగము వైచి యిండ్లలో
నిందితలట్టు లుంచుట నేర్చిరి వా రిటువంటిపోడుముల్.

ఎంత సరిపరచుకొన్నను నా మనసు నిలువకున్నది గదా? ఓయీ! నిన్ను నే నెట్లుమరతును? ఏమి? వచ్చుచున్నావా? రమ్ము! (బయలు కౌఁగిలించి) ఔరా! నా పాడువిధి న న్నింత నొప్పించునే? ఇం దెవ్వరును లేరే? ఏమి నావెఱ్ఱి? ఎవరది? శశాంకా!

[ప్ర. ప్రభావతి.]

తార:—పలుక వేమి? ప్రతిష్ఠానపురి కేగుదమా? (అని తట్టినిలుపును)



ప్రభా:—ఎందులకు?

తార:—ఎందులకు?— ఇప్పుడెన్నిజాములు మీఱినది?

ప్రభా:—రెండుజాములు మీఱియుండును.

తార:—అయిన నిప్పుడే-- (కౌఁగిలించి) ఇదేమి? నీవు శశాంకుఁడవు కావా? అయ్యో!

తరల.

భ్రమముచే గగనంబు పైఁబడ వచ్చినట్లు గ్రహం బెదే
నమర సోఁకినయట్లు సంపద యారిపోయినయట్లు; చి
త్తము వికాసముఁ దప్పిపోవఁగఁ దాల్మి కూలఁగ నిన్ను నే
హిమకరుం డని యెంచితిన్ క్షమి యించి ప్రోవుమ నెచ్చెలీ!

ప్రభా:—సఖీ! నీ వింత వేడవలయునా? ఊరడిల్లుము. అతఁడు వచ్చియున్నాఁడు.

తార:—వచ్చియున్నాఁడా? నీవు నా కెంత మహోపకారిణివి? నీ ఋణము నే నెట్లు తీర్పఁగలుగుదును?

ప్రభా:—నామాట కేమిగాని..............

తార:—కాని యేమి?

ప్రభా:—ఏమియు లేదు. నిదానముగ నన్నిసంగతులు మాటలాడ నగు. శశాంకుఁ డదే వచ్చుచున్నాఁడు. నాకు సెలవొసంగుము.

తార:—దయయుంచుము. (ప్రభావతిని బంపివైచి) ఆహా! ఇప్పుడు నా యానందమునకు మేర లేదుగదా? నవ మోహనాకారు నా ప్రణయసారుఁ జూడఁగలుగుటకంటె నా కేమికావలయు?—ఐనను నిదియంతయు నొక్కటేసారి యతనియెదుట వెడలఁగ్రక్కరాదు-- అదిగో! వచ్చుచున్నాఁడు. జాగరూకతమై వర్తించెదఁగాక. (ప్రక్కను నిలుచును)

[ప్ర. శశాంకుఁడు.]

శశాంక:—అమ్మా! నన్నుఁ బిలిపించిన కార్యమేమి?

తార:—(స్వగత) ఇదేమి? ఇతఁ డిట్లనుచున్నాఁడు? ఇంతలో మనంబు తిరుగలేదుకద? ఊరక, వచ్చినవెంటనే లోకులనుమానింపకుం

డుటకై యీ పన్నాగము పన్నియుండనగు. కానీ! దీనికి నిరుత్తర నయ్యెదఁగాక.........(పలుకదు)

శశాంక:—తల్లీ! ఏల పలుకవు? నేను నీయెడ నొనర్చిన నేరమైన నేమి?

తార:—(స్వగ) మఱల నిదియేమి? ఇదేదో క్రొత్తగా నగుపట్టు చున్నదే? (ప్రకా) ఓయీ! ఈజిత్తులమారితనము లెక్కడ నేర్చితివి?

శశాంక:—అమ్మా! నీమాటలు నాకర్థమగుట లేదు.

తార:—అర్థము కావలయునా?

ఉ. అర్థముఁగోరెదేని వినుమా! మును నీ గురు దేహమందు నే
నర్థముఁ బిమ్మటన్ వనము నందుఁ జరించినదాది నేను నీ
యర్థముఁ వ్యర్థవాక్యముల నారడిఁబుచ్చక యేలుమంటయే
యర్థము నీకు నే నిపుడ యాడినమాటలకో మనోహరా!

శశాంక:—ఇదేమి విపరీతము? ఆహా! తల్లిరో! ఎట్టి మాటలాడితివి? ఎంత సాహసమునకొడిగట్టితివి? నీ మనసెట్లు వచ్చెను? నా పాపిచెవులు నేఁడెట్టి వినరానిపలుకులు వినెను? నీవు నిక్కముగ గురుపత్నివేనా? కాదు. కాదు. నాకే మోసందియమయ్యెడిని. కాదేని యవనమేమి? నీవు నాకు .........రామరామ! ఈ పలుకులన్నియు నేమి? ఇట్లాడుటకే నన్ను బిలిపించితివి? బ్రహ్మాంశ సంభూతుఁడగు నీ శశాంకుఁ డంతయవినీతుఁడని తలంచితివా? వీఁడెట్టి పలుగాకికృత్యములకైన లొంగఁగలఁడని నిశ్చయించితివా? పొరవడితివి.

తార:—(స్వగ) ఇంతవడేలకో తనవృత్తాంతము గుట్టుగా నుంచదలంచి నట్లున్నది. (ప్రకా) నీ వెంతజాణతనము నేర్చికొన్నను నాకిపుడు చిక్కితివి. వగకాఁడా! బ్రహ్మాంశసంభూతుఁడవేని నీవు నిక్కముగ నవినీతుఁడవే. "తల్లిచెవులుఁ ద్రెంచినవానికిఁ బినతల్లి చెవులు బీరపువ్వులు" నుసామెతగావున్నట్లు కూతురనే పెండ్లియాడినవానికిఁ గురుపత్నియొంటటి లోనిదా? అదియును గాక నీకిది క్రొత్తకాదు. ప్రాతగిల్లినవన్నువు పథ్యకారికదా?

శశాంక:—అమ్మా! నీ వేమైనను గలఁగనుచుంటివా? యేమి?



తార:—నేను కాదు. నీవేమైన నొకవేళ లాతినెలంతలఁ గలలలోఁ గాంచియుండనగు. లేకుండిన నమ్మినదాని నిట్లు నట్టేట ముంచెదవా?

శశాంక:—అయ్యో! నా ప్రారబ్ధమా! ఇది యేమి చమత్కారము?

తార:—చమత్కారమా? కాదు కాదు నమస్కారము. లేనిపోని బలాత్కారము. ప్రతిఫలము సీత్కారము. వింటివా? ఈ కడమాట వినుము! కోరినకోర్కి ఫలింపనిచో— సంస్కారము మనోహరణా! నీ యుపకారము విస్మరించితివనియా యీ తిరస్కారము?

శశాంక:—ఛీ! నీ వల్లభునితో నిటులాడుము. నా దగ్గర నీవికారము లేమియుఁ బనికిరావు?

తార:—అయ్యో! నీకంటె నాకెవరు కలరు?

క. ఒల్లను శీలముఁ గులమే
నొల్లను, మానంబుఁ బ్రాణ మొల్లఁ బ్రపంచం
బొల్లను వేయేటికి నీ
వొల్లననినఁ దొకటితక్క నొల్ల నితరముల్.

కావున నను దయఁజూడుము! చిన్నతనపుబిగువుఁ జూపితివని యాగ్రహింపకుము! చెప్పుము కైకొనెదవా?

శశాంక:—ఇదేల యిటులడిగెదవు?

తార:—మక్కువ లేనివానిని బతిమాలినమాత్రము ఫలమేమి?

శశాంక:—తల్లీ! ఇప్పుడు సంతసించితిని. నాకు నిక్కువముగా మక్కువ లేదు సరికదా? పరలోకభయము మిక్కుటము. అదు నాకు సెలవిమ్మా! నే నేగెద.

తార:—వెఱ్ఱివాఁడా! ఇప్పుడు నీకు పరలోకము కావలసివచ్చెనదా? పరలోకమెక్కడిది? ఇదేకదా! తనసంతత దానిని స్వర్గలోకమే మవరించినప్పుడింక భయమేమి? నీకు మక్కువ లేదని సంతసించి విడిచిపుచ్చెదననుకొంటివా? ఎంత భ్రమించితివి? ప్రాణములైన విడిచిపుచ్చెదగాక నిన్ను విడిచి నేనుండఁజాలనే? అట్టిట్టనే నీకు సెలవొసఁగుదునట్లా? నన్ను కాదని నీవేగుదువట్లా? నీ వేహోదించిపుమము!

శశాంక:—అమ్మా! నీవు నెలవీకున్నమాన నీతో నేను విశేషించి వాదింపఁజాల. వృథా వ్యవధి కోర్వనుజాల. ఈ చింతమాని నిశ్చలబుద్ధి సౌఖ్యముగఁ గాలముఁ గడపుము. నేఁబోయివచ్చెద.

(నిష్క్రమించును.)

తార:—పోయెదవా? నామాట వినక పోయెదవా? ననువీడిపోయెదవా? ననుఁ గావఁజాలక పోయెదవా?—కానిమ్ము! నేనే నిక్కంపుటాఁడుదాననైన నిను సాధింపఁజాలనా? ఎంతదూరముపోయెదవో చూచెదఁగాక ..........

తే. నేను నిక్కంబుగా నాఁడుదాననేని?—
నాఁడువారు పట్టినపట్టె యన్నికడల
వెనుకఁ బడకుండు నేని నీ వేళ నాదు
పంత మెటులేని నెగ్గ సాధింతుఁ గాక.

(నిష్క్రమించును.)

---

## చతుర్థాంకము.

### రంగము ౧. ఆకాశమార్గము.

విచిత్రప్రియుఁడు—వినోదపాలుఁడు.

విచిత్ర:—మిత్రమా! వినోదపాలా! చూచితివా? తార బృహస్పతియింటి మారియోయన శశాంకు నెటు వెంబడించుచున్నదో? పాపము శశాంకుఁడు పరుగెత్తి పోవుచున్నాఁడు!

వినోద:—అవునవును విచిత్రప్రియా! అదిగో ఆప్రక్కఁ గాంచితివా? బృహస్పతిశిష్యుఁడొకఁ డింద్రుని వెంటనిడుకొని యిటే వచ్చుచున్నాఁడు—అయ్యో! పాప! మతఁడు శశాంకునడ్డగించి వజ్రపుగొమ్మున్నం బొడుచుచు నేమో యనుచున్నాఁడు. ఇతఁ కేమియు తారయుష్ఘడే వెనుక కుదిరిగి కాలికి బుద్ధిచెప్పుచున్నది. అలటు వినుము!

(తెరలో.)

ఓరీ నిశాటా! ఎంతపని చేసితివిరా?



ఉ. యోజన యుండఁగావలదె? యోరి మహోగ్ర దురాగతానుకూ
లా! జనదూషకా! వికృతలాంఛన! దుర్ణయ! దుశ్చరిత్ర! దు
స్తేజ! గురూంగనామణి యిసీ! జనయిత్రియు కాదురా? నృశం
సా! జగతీతలం బెటులు సైచెడి నీయటువంటి రాజులన్?

విచిత్ర:—ఇప్పుడు శశాంకునకు సంకటమే ప్రాపించినది. తా నిప్పుడు నిర్దోషి యయ్యుఁ బౌరుషమునకుఁ బోరాడి తీరనే వలయు. అదే అతఁడు నేదో ప్రత్యుత్తరము నొసంగుచున్నాఁడు! విను విను!

(తెరలో.)

ఓరీ! సహస్రాక్షా! నీ వాకవేళ మూర్ఖుఁడవైన నన్నెఱుంగక పోయినను లోక మెఱుంగకపోదు.

మ. గురుతల్పానుగతుండ నౌటకు శశాంకుండన్ సుమా నేను! ని
ష్ఠురముల్ ప్రేలెద వేల కూళవయి? నీచుల్, నిన్నుబోటుల్ మునీ
శ్వర భార్యారత ఘోరపాతకులు నా వామాంఘ్రియందేనఖాం
కురముల్ గానియుఁ బోలనేరుతురె? వాకుర్వారత్వ మింతేటికిన్?

వినోద:—బళీ! శశాంకా! బాగుగా నెత్తిపొడిచితివి.

విచిత్ర:—మతల మహేంద్రుఁడేనో యాలోచించుచున్నాఁడు.

వినోద:—ఆసంగతి మన మెఱుంగనిది కాదు. సూదికోటకు సోదెకుబోవ ఆబాలరంకు బయటఁబడెననుట సార్థకమయ్యెననియె కావచ్చును. బిగ్గరగా నేమో మాటలాడుచున్నాఁడు. పరికింపుము!

(తెరలో.)

దురాత్మా! దోసమొనర్చియుఁ గప్పిపుచ్చ దలంచుచుఁ బయింబయిన నన్నె మూర్ఖుఁడనఁ దొడంగితివా? ఎవఁడు మూర్ఖుఁడో యిప్పుడే తెలియుదువుగాక.

కవిరాజవిరాజితము.

వడివడి నీదగుపాపములన్నియు బాయఁగ నాదగు బాణమునన్
మడిసి కృతాంతుని మందిరముం ద్రుటిమాత్రన చేరఁగఁ బోయెదుసూ!

విచిత్ర:—తిరిగి శశాంకుఁడే మో పలుకుచున్నాఁడు.

విడు! మీటు లేటికి పెక్కులు పల్కెదు బెట్టిదముల్ మృత్యి లేదనికా

మిడిసెదు నీవొక మేటివటంచు ని మేషముచూపుమె టయ్యెనొకో!

వినోద:——మిత్రమా! మన మింతవఱకీ ప్రసక్తిలోనే మునిగి త్రొక్కినవి నోదములు విడిచితిమి. అటు దూరమున దృష్టిసారింపుము. అచ్చట తార దిగ్భ్రాంతయై యేటికు నిలిచియున్నదో?

విచిత్ర:——అదేమి చూచెద వింకను నటువిలోకింపుము. కుంచె సారించుకొనుచు నారదుండెటులనుగుచున్నాఁడో?

వినోద:——అవునవును. కలహమునకన్న విశేషముగు కార్య మతని కేమివచ్చినదో? అటుపోయి పరిశీలింతము రమ్ము!

(ఇరువురు నిష్క్రమింతురు.)

---





# సతీ తార.

## పంచమాంకము.

రంగము. ౧. అరణ్యమధ్యము.

ప్ర. ప్రభావతి.

అక్కటా! ఆంగిరసపత్ని తార యెందరిగినదో కదా? ఆమె కోసము తిరిగితిరిగి వేసరితిని. "దొంతికికడవయు నింటికిల్లా" లన్నట్టులామెలేని యిల్లెంతబోచిపోయినది? శిష్యులు తలకొకదారి నరిగిరి సరేకదా? వచ్చినవారందఱకీకథ చెప్పలేక వేగిపోయినాను. ఈయరణ్యమువంకఁ జనుచుండఁగాఁజూచినవారే కాని యిందుఁ బ్రవేశింపఁగాఁజూచినవా రొక్కరును కానరారు. ఔరా! సురగురునంతటివానిధర్మపత్ని యెట్టిస్థితికి వచ్చినది? జారత్వమునకుఁ గల పాటులన్నియు నాకిపుడు ప్రత్యక్షముకదా? అదిరా కాలమహిమ!

తే. ఎంతలెంతటివారెంత హీనగతికిఁ
జొత్తురో? పూర్వకర్మమే చొప్పొ తెలియ
సాధ్యమే? బుద్ధిహీనులు సర్వమాత్మ
కృతమటంచుఁ దలంచి పొంగెదరుగాక.

"బుద్ధిః కర్మానుసారిణీ" యనుటఁ యథార్థము. ఓహో! వీరు దేవతలు కదా? వీరికే యీపాంతలు తప్పనప్పుడిఁక నరలోకమునుగతి చెప్పెడిదేమి?

(తెరలో)

నరలోకమే చాల మేలు. ఈదేవలోకమంత పాడులోకమెందును గానరాదు.

తే. కనులుమూసి యొకానొక గడియయైన
శాంతిఁ బొందగరాదు; వి శ్రాంతి లేమి
విసిగి ప్రాణములైనను వీడ రాదు
కటకటా! దుఃఖమునని మ్రగ్గంగవలయు.

(వినుట నభినయించి) అదిగో! ఇందే హతాశయై దుఃఖించు నీపె యెవరు కావచ్చును? తారయే యగునేమో— పోయి యోదార్చెదఁ గాక. (ముందుకు నడువగా)

(వెనుక అవనిక యెత్తఁబడి)

ప్ర. తార.

నా బ్రదు కెంత నగుబాట్ల పాలైనది?

చ. పెనిమిటి చింతఁబొందఁ, గని పెంచినవారి యశంబు మ్రందఁ, జూ
చినజనులెల్ల ఛీయనుచుఁ జీదరపొంద, వ్రతంబు భంగమై
నను సుఖమేని దక్క కిటు నాతులలో నగుబాట్లు తెచ్చికొం
టిని; స్థిర తోషదాయక మటే యిది? యీ బ్రదు కింకఁ గాల్పనే?

ప్రభా:—చెలీ! ఇచ్చట కేటువచ్చితివి?

తార:—(చూచి) హా! సఖీ! ఏమి చెప్పుదును?

తే. పండువంటికాపుర మబ్ధి పాలుచేసి
భర్త నతిపావనుం బలు పాట్లు పెట్టి
యంతఁ బోక పయశము పాలై సుఖంబు
నార్చికొను పాపురా లెంతకైనఁ దగదె?

(ఏడ్చును.)

ప్రభా:—అతివా! ఊరడిల్లుము. ఇందు నీదోసము వీసమును లేదు.

తే. బ్రహ్మఁ దిమ్మంగఁ దిమ్మని బ్రహ్మఁ గాఁగ
సలుపనేర్చిన దేవతా సార్వభౌముఁ
డఘటనాఘటనైకమహాసమర్థుఁ
డైన విధికృతిఁ దుర్వారంబ్యమ్మసుమ్ము!

తార:—మంచి చేకూరినపుడంతయును మన ప్రజ్ఞాబలమేయని మిన్నుము ట్టి కీడుమూఁటిలినంత విధినిదూరుట లోకస్వభావము. కాని, విధి నేమిచేయుమనెదవు? మనల నిట్లొనర్పుమని విధివ వంచునా యేమి



యెనా? ఇంతకు నేను క్షంతవ్యురాలను కాను. మహా దురితాత్మురాలను.

ప్రభా:—దుఃఖింపకుము. నీ కింకను జెప్పవలసినది బోలెడు కలదు. పోదము రమ్మా!

తార:—ఎచ్చటకు?

ప్రభా:—నీవు దుఃఖమానసనిమగ్నవైయుంటఁ దెలియకున్నదానవు. ఎంత యెండగానున్నదో పరికింపుము!

క. అంబుజమిత్రుఁ డదే కను
మంబరమధ్యమ్మునం దనాప్తవిభే
దం బించుకేని లేక, క్ర
మంబున లోకములఁబట్టి మాడ్చఁదొడంగెన్.

ఆ వృక్షచ్ఛాయ కరుగుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

పంచమాంకము.

రంగము ౨. అరణ్యము.

ప్ర. బృహస్పతి.

ఛీ! స్త్రీజనము కేమి మానాభిమానములా? వావివరుసలా?

చ. తలపగరాదు నిల్కడను నిదానము సంగతి; లేదు పిన్నపె
ద్దల వివరించు నేర్పు; పెడదారులనుండి మనంబు ద్రిప్పఁగాఁ
గలిగిన తెల్వియించుకయు గాని కనంబడ; దందుకై కదా?
వెలఁదుల రాజు లంతిపురి వీడి చరింపగనీయ రెప్పుడున్.

కాని, స్త్రీలలోమాత్ర మత్యంతగుణవతులై తమ పతివ్రతాత్వమున జగము లల్లలనాడించినవా రెందఱు లేరు!

సీ. సృష్టించి పెంచి నాశించు మహాత్ములఁ జిన్ని
సుతులఁ జేసిన యనసూయ యేమి?

శమనునంతటివాని జంకించినాథుని
విడిపించుకొనిన సావిత్రియేమి?
యగ్నిప్రవేశమై యఖిలలోకములలో
శీలంబుఁజాటిన సీతయేమి?
కులముకంటెఁబవిత్ర గుణమెక్కుఁడనిసదా
తెలుపు నరుంధతీ దేవియేమి?
సర్వకాంతాసమూహ మస్తకవిభూష
ణంబులైపురుషులకెల్ల నానవచ్చు
నట్టులునటింప రేతల్లు? లట్టివారి
పాదములకు నమస్కరింపంగనలవె?

ప్ర. నారదుఁడు. (శీఘ్రగమనమున)

నార:—వలదు వలదు ఒకక్షణమైన నీ విందు నిలువవలదు.

బృహ:—ఇదేమి? నారదా! నీవా? అభివాదనము.

నార:—ఈ యభివాదనములకేమి? నీ విపుడురాకున్నచో బుట్టిమునుఁగును—

బృహ:—ఎందులకు?

నార:—ఎందులకా? మందులకు- ఇంద్రచంద్రులకు ఘోరమగు పోరు పొసంగి యెల్లెడల నల్లకల్లోలముఁగ నున్నయది.

బృహ:—కారణ మేమికావచ్చును?

నార:—అదియు నడుగవలయునా? నీకంటె నిపుడంతటి బలవత్తరకారణ మేమికలుగును?

బృహ:—నే నెట్లు?

నార:—నీవుకాకున్న నీభార్యఁ ఇచ్చట మాటలాడుచు నిలుచుటకు వీలులేదు. కావున నడచుచు మాటలాడుదము రమ్ము!

బృహ:—క్షమింపుము నేను రాఁజాల.

నార:—నీవు రాకున్న లోకము శశాంకహీనమగు.

బృహ:—హరి హరి. నీనోట నట్టి యమంగళము రారాదు.

నార:—రారాదు కాని, క్షణముగడచినచో నిఁక నీవు వచ్చియుఁ బ్రయోజనముకలుగదు. అప్పుడందఱునోటనిదే వచ్చును.



బృహ:—ఇఁక రావలసినదేనా?

నార:—ఇంకను రావలసినదేనా యని యడుగుచుంటివా? సరే! నీ యిష్టము నుడువవలసినదంతయు నుడివితిని. ఇఁక నేనుమాత్ర మిందుండఁజాల—

బృహ:—ఇదిగో! నేనును వచ్చుచున్నాఁడను. త్వరపడకుము!

నార:—త్వరపడకుముఁ? పిల్లికిఁజెలగాటము నెలుకకుఁ బ్రాణసంకటము. నీకేమి?

బృహ:—నీకుమాత్రమింత సంకటమేమి!

నార:—ఏమో! నీ కెట్లు తెలియఁగలదు? ఏమి? వచ్చెదవా? లేదా?

బృహ:—నీ వింత కాదనినప్పుడు రాక మానుదునా? నడువుము!

(ఇరువురు నిష్క్రమింతురు)

---

పంచమాంకము.

రంగము. ౩. యుద్ధభూమి.

ప్ర. యుద్ధసంసిద్ధులై ఇంద్రుఁడు. శశాంకుఁడు.

ఇంద్ర:—ఓరీ! ఏల నివ్వెరగందెదవు? గురుదారం బొందిన దోష మూరకపోవునా?

శశాంక:—ఓరీ! అహల్యా చిత్తచోరా! నిర్దోషినగు నన్నూరక దెప్పుచున్నాఁడవు కాని గురిగింజ తనక్రిందినలుపునే తానెఱుంగజాలనట్లు నీవు నీదోషము లెఱుంగవుకాబోలు!

ఉ. పట్టితికాదె గౌతముని భార్యను మాపటివేళ కోడివై?
కొట్టితికాదె యల్ల దితికూననుగర్భమునంద ఘాతివై?
యిట్టి నినుఁ దివంబునకు నేలికఁజేసిన ధాతచెంపపైఁ
గొట్టక లాతివారలకుఁ గూడను వంకలు వెట్టెదేలరా?

ఎవరు దోషులో ఎవరు నిర్దోషులో యీ యుద్ధముననే తెల్లము

కాఁగలడు. వృథా ప్రగల్భములాడక నీకుమాటలలోనున్న చాతుర్య మును చేతలలోఁ జూపింపుము!

ఇంద్ర:—వాచాటా! అట్లైన గాచుకొమ్ము!

బంధుర వృత్తము.

నిలు మొక నిమిషము నిజముగ పలువా!
నీకిదె కాలము మూడెనురా!

శశాంక:—వెలనెఱుఁగనిపలు కులు విసు వునిడుక
వీరడవై యిటు ప్రేలకురా!

ఇంద్ర:—తలఁగుము! పయిం బడి నదె కనుమిదిగో
దారుణ బాణ పరంపరరా!

(అస్త్రములు వేచును.)

శశాంక:—(తప్పించుకొని) తలగెదఁ గడువడి వడి విడిచిన నీ
దారుణ బాణము లెయ్యవిరా?

ఇంద్ర:—(కోపమున) నీచా! ఏల త్రుళ్లెదవు? రుద్రుఁడడ్డమైనను నిన్నీ పాకారి వీడఁడు ఇదే యీ రౌద్రాస్త్రముం దాలుము. (ఎక్కు వెట్టును.)

శశాంక:—నీ రౌద్రాస్త్ర ప్రతిమానమగు నీ బ్రహ్మశిరోనామకాస్త్రముం దాలుము. (ఎక్కువెట్టును.)

ప్ర. శీఘ్రముగ నారదుఁడు బృహస్పతి.

నార:—ఓహో! ఇంద్ర శశాంకులారా! శాంతింపుఁడు శాంతింపుఁడు యుష్మద్గురుసత్తముఁడిదే యితని విలోకింపుఁడు! (మధ్యగుఁడై యి నిలుచును.)

(ఇరుపురు)—ఎవరీ? (అనిచూచి) గురూత్తమా! నమస్కృతులు. (సాష్టాం గములొనర్తురు.)

బృహ:—వత్సలారా! కళ్యాణ మగుఁగాక. శాంతింపుఁడు!

శశాంక:—గురువర్యా! ఈయింద్రుఁడు కలహకారి. వీని విడువఁజాలఁ నాకునెవ్వరానఁగుఁడు!

ఇంద్ర:—ఆర్యా! ఈ శశాంకుఁడు తమకు మహాపకారి. వీనిం బరిమార్ప నానతీవలయు.



నార:—శశాంక! ఇంద్ర! ఇది మీయిరవురదోసముం గాదు. శమిం పుఁడు!

శశాంక:—దేవా! అదియెట్లు?

ఇంద్ర:—మునీంద్రా! కారణము సెలవిండు!

నార:—ఇదిగో! వినుండు!

ఆ. ఈశశాంకవేష మీగురుం డు ధరించి
తనదు వేష మత్రితనయుకిచ్చె
నీశశాంకుఁ డిద్ది యెఱింగింపకునికి ని
గ్గురుఁడు లేకయునికి జరిగెనింత.

ఇంద్ర:—ఇప్పుడు నా యనుమానము తీరినది.

శశాంక:—నే నిప్పుడు చరితార్థుఁడను.

నార:—అదిగో! ఈ గురుపత్నియు నటదూరమున దిగ్భ్రాంతయై నిలిచి యున్నది. అమ్మా! చూచెదవేమి? రమ్ము!

బృహ:—నారదా! ఆ పాతకి నిం దేల పిలిచెదవు?

ఉ. సిగ్గును నెగ్గు నెమ్మనము చెంతకుఁ దార్పక భర్త యున్న యా
సిగ్గునుగూడఁ దీయుటకు సిద్ధముగానయు, లాతివానిపై
నగ్గలమైన ప్రేమ తన రార ధనాంగనరీతి నెంతకే
నొగ్గినదంచు లో నెఱింగి యుక్తి బిలువక బనియేమి చెప్పుమా!

నార:—నీ వూరకుండుము! ఆమె యే పాపము నెఱుఁగదు.

బృహ:—ఐన నేనే నా పాప మెఱింగినవాఁడను?

నార:—అటుకాదు. ఆమె యిప్పుడు పశ్చాత్తప్తురాలై, మీదుమిక్కిలి నావలన బ్రహ్మజ్ఞాన ముపదేశమై యున్నయది కావున పావన చరిత్రయు— భవదనుగ్రహపాత్రయు—

ప్ర. తార (సిగ్గుతో.)

తార:—

తే. భర్తయె శశాంకుఁడున్నరూపంబుఁ దాల్చి
ననుఁ బరీక్షించె నీరీతి ననుచు దేవ
ముని వచించుటచేలె గొంత మనసు కేమి
యో? సమాధాన మమరిన ట్లున్న దిపుడు.

ఓహో? నాథుండును శశాంకమహేంద్రులు నిందేయున్నారే? వీరందఱయెదుట నే నీయాయనకు జాలిరానలయును. (పోయిపాదముల వ్రాలి) హృదయేశ్వరా! కరుణించి నాయపరాధము క్షమింపుడు! నేను మహాదురితాత్మురాలను.

సీ. ఏమనుదాన? నాథా! మహాపాతకి
నేను నా పాపంబు లెట్లుతీరు?
చెలువకు భర్తయే దిక్కుకదా? మీరు
సైచనియట్టి యీ జన్మమేల?
నా పురాకృతకర్మ మీపగిదిని గల్గెఁ
దలనువ్రాసినవ్రాలు తెలియఁగలమె?
యీ యపకీర్తి నా కేకాక మీకును
గోత్రమాత్రం బొనఁ గూడకున్నె?
నేరమొనరించితి నపార ఘోరకృతికి
బాలుపడితిని శిక్షకుఁ బాత్రురాల
నగుట మీ యిచ్చవచ్చిన యటులొనర్చి
తెలివిఁగల్పించి ప్రోవఁ బ్రార్థించుదాన!

నార:—ఆంగిరసా! నీ వేమియు యోచింపకుము.

ఉ. నేర్చియొ? నేరకో? జరిగె నేరము పూర్వకృతానుకూలమై
యోర్చికొనంగఁ బూరుషుల కొప్పు; గతించినదాని కిప్పుడే
మార్చిన నేమిలాభము? మహామహులౌనినుబోంట్లు శాస్త్రముల్
కూర్చెడివారు చెప్పికొనఁ గోరుదురే యితరత్ర ధర్మముల్?

శశాంక:—గురుసత్తమా! ఇంక సంశయింపకుము!

క. పశ్చిమబుద్ధి నొనర్చిన
దుశ్చరితలనుండి మనసు తొలఁగియు కాదా?
నిశ్చయముగాఁగ నీ యమ
పశ్చాత్తాపంబు నొందిపావనతఁ గనెఁ?

కావునఁ దమకిప్పుడు తప్పక పరిగ్రహణీయురాలు.

ఇంద్ర:—దేవా! నన్నుఁ గూర్చియైన నీజననిని గైకొనుఁడు!

తే. కాంతుఁడేదిద్దికొనకున్నఁ గామినిచెడి
పోవుఁ గావున, నీయమం బ్రోవవలయుఁ;
గానిచో "నేర్పుబొం కత్త గారు--మగఁడు
ఱంకు" నను సామెతయె యథార్థతను బొందు

నాకు మీయెడఁగల చనవిట్లుననుఁ బురికొల్పినందులకు క్షమింపవలయు.

బృహ:—కుమారా! క్షమింపవలసినదేమి? నీవెంతయు నిక్కముననే పలికితివి. నారదా! నీ యాన మీఱఁగలనా?-- వత్సా! శశాంక! నీ గురుభక్తికంటె నీ మనోస్థైర్యము, నంతకంటె నీవినయమును విశేషించి పొగడఁదగినవి. నేను మీ యందఱకోర్కి ననుసరించి యీ నెలంతను గైకొంటి. ఇంక మీ కేమికావలయును?

శశాంక:—మీకృపవలన మా కేమిటను దక్కువలేదు. అయిన నిట్లగుగాక.

చ. గురుజనులందు భక్తి సమ కూరుత లోకులకున్---

ఇంద్ర:—ఆపై నిట్లగుఁగాక.

... ... ... ... దరిద్రతా
గరిమ చెలంగు యుద్ధములు కల్గక శాంతి పొసంగుతన్ ధరా
వర సముదాయమందు... ... ... ...

నార:—మఱియు నిట్లగుగాత

... ... మగవారలలోఁ గడువృద్ధు లెప్పుడున్
ద్వరపడి చిన్నభార్యల వివాహములన్ గొనకుండ్రుగాతన్.

బృహ:—(స్వగ) నాకు తిన్నఁగాఁ జీవాట్లు వైచితివి. (ప్రకా) తథాస్తు

నార:—ఇంకను నిట్లగుగాక.

## భరత వాక్యము.

కాలమునుదప్పక యకల్గునిలవర్షములు కామినులు శీలవతులై భర్త్రా
ళులను దైవములయట్ల కడుగౌరవము నాత్మలనుదాల్చి కొలువంగా మేలు
కులధర్మముల మీఁది మమకారమున మేదినిని సౌఖ్యములుగాంచున్
జాలలనికఁ గాంచెదరు సత్కవినుతుల్ గొనుచు సర్వులును

మంగళో మహాశ్రీః.

ఇది

శ్రీ భారద్వాజసగో, త్రాపస్తంభ సూత్ర,

అనుముల వంశ పవిత్ర, భ్రమరాంబా శీతా

రామ వర జ్యేష్ఠపుత్ర, వేంకట శే

షకవి ప్రణీత చిత్రం బగు

"నభినవ తారా శశాంక

విజయ" మను సతీ-తార

సంపూర్ణము.



శ్రీ వాణీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితము.

# కవిభీమన.

ఐదంకముల యాంధ్రనాటకము. కథావిధాన మత్యద్భుతము. యోగుల శాపానుగ్రహములు, రాజుల లోభోదారములు, పండితుల యవధానప్రస్తుతులు సరసముగా జిత్రింపఁబడినవి. ప్రతివిద్యార్థియుఁ, బ్రతిపండితుఁడును, బ్రతిసామాన్యుఁడును విలోకింపఁదగినది. పద్యములు పంచదారముద్దలు.

(మాదిరికొక పద్యము)

ఉ. రాజవు నీవు; నేను కవిరాజను; పూర్వమునుండి యిట్టులే
రాజులు మమ్మువంటి కవిరాజుల మన్ననఁ జేసి కీర్తి వి
భ్రాజితరాజమాన్యసువిరాజితులై యలరారినారు సు
మ్మా! జననాథచంద్రమ! శ్రమంబెనకే మము నాదరింపుమా!

వెల రు. ౧-౦-౦

రా: ముందుగా వ్రాసుకొనినవారికి పోస్టుకర్చులు లేవు.

---

# శ్రీచౌడేశ్వరీ మాహాత్మ్యమ

(ఐదాశ్వాసములయాంధ్ర ప్రబంధము)

ఇందుఁదొగటివీరుల చరిత్రయు, నందవరీక చరిత్రయ
గావర్ణింపఁబడినవి. ఒక్కొక పద్య మొక్కొకరత్నము. గ్ర
రైనది. అచ్చుకొఱ కెదురుచూచుచున్నది. దాతలు సాహ
ర్పఁ బ్రార్థితులు. ప్రతులకొఱకు ముందుగా వ్రాసుకొనువా
ర్భులుండవు.



అడ్రస్:—


అనుముల వేంకటశేషకవి
ఆంధ్రపండితుఁడు,
మహమ్మదీయపాఠశా
నం

